ఈలాగుననే మీది వరుసలలో మొదటిఛందమునుండి నాలుగోఛందమువరకు పైని చెప్పిన విషయముల వివరణ ఉన్నది.

అయితే మీది వరుసను బట్టి కిందివరుస వేసుకొంటూ ఉంటేనేగాని 8వ ఛందములోనో 16 వ ఛందములోనో మరి యేదైనా ఛందములో ఈవృత్తములసంఖ్యలు తెలియజేయుట కష్టము; గనుక, ఇంగ్లీషుబడులలో చదువుకొనే విద్యార్థులు ఈవిషయములను తెలుసుకొనుటకు ఒక సులభమైన మార్గమున్నది. దీనినిబట్టి అడిగిన ఛందముగురించి ఈవిషయములు వెంటనే చెప్పగలము ఉ॥ పదియవ ఛందములో ఎన్నెన్నిలఘువుల వృత్తము లెన్నెన్ని ఉన్నవి?

$(గు+ల)^{10}=1గు^{10} + 10గు^{9}ల^{1} + 45గు^{8}ల^{2} +120గు^{7}ల^{3} + 210గు^{6}ల^{4} + 252గు^{5}ల^{5} + 210గు^{4}ల^{6} + 120గు^{3}ల^{7} + 45గు^{2}ల^{8} + 19గు^{1}ల^{9} + 1ల^{10}$

$1గు^{10}$ అంటే 10న్ని గురువులే అయినవృత్తము ఒకటి

$10గు^{9}ల$ అంటే 9గురువులున్ను 1 లఘువున్ను అయినవి 10

$45గు^{8}ల^{2}$ అంటే 8 గురువులు 2 లఘువులున్ను ఉన్నవి 45

ఈలాగుననే కడమవి తెలుసుకోవచ్చును. 6. సగణలగక్రియ శకటచక్రము (చూ.మూ. III.72-76

1 | ఇది పాదములో అన్నీ గురువులే కలవృత్తము (1)
2 | 3 | 5 | 9 | 17 | ఇవి 1 లఘువుగలవృత్తములు (5)
4 | 7 | 13 | 25 | 6 | 11 | 21 | 10 | 19 | 18 | ఇవి 2 లఘువులు గలవి (10)
8 | 15 | 29 | 14 | 27 | 25 | 12 | 23 | 22 | 20 | ఇవి 3 లఘువులు గలవి (10)
16 | 31 | 30 | 28 | 24 | ఇవి 4 లఘువులుగల వృత్తములు (5)
32 | ఇది 5 లఘువులు గల వృత్తము.

ఈ చక్రము వేసేపద్ధతి: —

నిలువుగా ఉన్న మొదటిఆరుగళ్లలోను−1,2,4,8,16,32 ఇట్లు సంఖ్యలు ద్విగుణముగా వేయవలెను. తర్వాత అడ్డుగా ప్రతిసంఖ్య ద్విగుణముచేసి ఒకటి కొట్టివేస్తూ అట్లుచేయగా వచ్చిన సంఖ్యప్రక్కను మళ్లీ అట్లే చేస్తూ వేయవలెను. ఈఛందమున 32 వృత్తములకంటే ఎక్కువ పుట్టవు గనుక 32కు మించే సంఖ్య వేయరాదు. ఇట్లు చేసినతర్వాత పైచాలున ఉన్న సంఖ్యలు క్రింది చాలున ద్విగుణముచేసి వేయవలెను. ఈసంఖ్యలలో ప్రతిదానిప్రక్కను అది ద్విగుణము చేసి ఒకటి కొట్టివేయగా వచ్చిన సంఖ్య వేయవలెను. దాని ప్రక్కను మళ్లీ అదేవిధముగా సంఖ్యలు వేస్తూ ఉండవలెను. ఎన్నో ఛందమునకు ఈ చక్రము వేస్తున్నామో చూచుకొని అందులో ఎన్ని వృత్తములు పుట్టినవో ఆసంఖ్యకు మించకుండా అంకెలు వేసుకొంటూ వెళ్లవలెను.

కొన్నివృత్తముల లక్షణమును లాక్షణికులు వివిధముగా చెప్పినారు, చూడండి:-

## 1. క్రౌంచపదము.

1. క్రౌంచపదా భ్మౌస్మౌ ననా న్గావిషు శరవసుమునివిరతిరిహ భవేత్

UII UUU IIU UII III III III III U
భ మ స భ న న న న గ

(ఇది సంస్కృతవృత్తలక్షణము. 25వ ఛందము 16776391వ వృత్తము)

2. శీతకరోర్వీవాతశ + శాంకర్ యుగమితమరపురనివహదకడియోళ్ (ఇది కన్నడపద్యలక్షణము. ఇందులో విశేషము:— ప్రతిపంక్తిలోను ప్రాసయతి. తక్కినలక్షణము సంస్కృతమం దున్నట్లే ఉన్నది)

3. పంచశరాభా + నంచిత పుణ్యా + భమసభననయ + పరిమితమైనన్ (కవిజనాశ్రయము)

4. ప్రాంచిక తేజః + కుంచితవైరీ + భమసభననయ + పరిచితరీతిన్ (కావ్యాలంకారచూడామణి.)

5. కాంచనభూషా + సంచయ మొప్పన్ + ఘనకుచభరమునఁ+గవునసియాడన్ (ఛందోదర్పణము).

పై మూడింటిలో (3, 4, 5) లక్షణము మారినది. ఈలాక్షణికులు దీనిని 24వ ఛందమునందు పుట్టిన 4193479 వ వృత్తముగా చెప్పినారు. సంస్కృతములోను కన్నడములోను పాదాంతమున ఉన్న IIU మార్చి UU చేసినారు. మాత్రలసంఖ్య ఒక్కటే గనుక నడకలో భేదము కనబడదు. కన్నడపద్యమువలెనే ప్రతిపాదమునందును ప్రాసయతి ఉన్నది; అంతేకాక తెలుగుపద్యముల సంప్రదాయ మనుసరించి మొదటి అక్షరముతో రెండుచోట్ల వడి ఉన్నది.

6. పంచముకేశుం డిచ్చిన భాస్వ + ద్వరమున మనమున +బవరముగోరన్

వంచనతో బాణాసురుహ స్త + వ్రజములు.................................

(ఇది అప్పకవిది. తక్కిన లాక్షణికులు చెప్పిన ప్రాసయతి ఇతడు పాటించలేదు.)

7. తావులు మీరం + బూవుల వానల్ + దఱుచుగఁ గురియఁగ + దతఘనభేరుల్ (ఇది కంకంటి పాపరాజు ఉత్తరరామాయణములోనిది. అప్పకవి కాక తక్కిన తెలుగులాక్షణికులు చెప్పినట్లే ఉన్నది.

8. చంచులనాస్వా+దించుచు లేఁదూం+డ్ల కరువుప్రియలకు+నలఁచుచు మైరో

మాంచము. ... (నన్నెచోడుని కుమారసంభవము.)

కావు గనుక ఇందులో విశేష మేమంటే అప్పకవికాక, తక్కిన తెలుగులాక్షణికులున్ను కన్నడలాక్షణికులున్ను చెప్పినట్లు పాదములందు ప్రాసయతి ఉన్నది; కాని తెలుగు లాక్షణికులు చెప్పిన వడినియమము పూర్తిగా లేదు. పాదద్వితీయార్థమునగల విశ్రమస్థానముల రెంటను ఉన్నవడి అక్షరములు తమలో తాము మైత్రి గలవేగాని పాదాద్యక్షరముతో మైత్రి గలవి కావు గనుక నన్నెచోడునిపద్యము వృత్తముకాదనిన్ని మాత్రాపద్యమనిన్ని సీనమువలె నున్నదనిన్ని అందుచేత “ఇది నన్నెచోడుని ప్రాచీనత

కొకగొప్పకారణ” మనిన్ని మా. రామకృష్ణకవిగారు వ్రాసినారు. వృత్తముల కుండవలసిన ముఖ్యలక్షణము ఉన్నది గదా ఇది వృత్తముకాదని కవిగారు ఎట్లు చెప్పగలరు? నాలుగు పాదములందున్ను గణము లొకేతీరున ఉన్నవి. (మాత్రాపద్యములందు

అన్ని పాదములలోను గణము లొక్కరీతిగా నుండనక్కరలేదు.) తెలుగుకన్నడపద్యముల సంప్రదాయ మనుసరించి నాలుగు పాదములలోను ద్వితీయస్థలమున ప్రాసమున్నది. లయగ్రాహి మొదలయిన ఉద్ధరమాలావృత్తములలో ఉన్నట్లు ప్రతిపాదమున కొంతవరకు ప్రాసయతి ఉన్నది. జాత్యుపజాతులు మొదలయిన దేశ్యపద్యములలో చేరదు. ఇది ఒక రీతి క్రౌంచపదము; దీనికి సరియైనలక్షణము ఏలాక్షణికుడున్ను చెప్పలేదు.

## II త్రిభంగి.

ఈ గ్రంథమందు మూలమున (చూ. II. 134) త్రిభంగి వృత్తము అచ్చుతప్పులతో నిండియున్నది. సరియైన పాఠము: —

ననన నననస + లును భమసగలును +
దనరి నటింపఁ గణంకన్ నలువంకన్ బెంపు దొలంకన్
మునుకొని నఖముఖ + మున వెడఁగ దలుపఁ +
జనుగడు నొప్పగువీణల్ నెరజాణల్ వేలుపుగాణల్
వనరుహజనితుని + తనయులు మొదలుగ+
ఘనషతు లాడుటతోడన్ శ్రుతిగూడన్ వెన్నుని బాడన్
వినగలిగిన నది + జననము ఫలమని +
మునిజను లిందు శుభాంగున్ దగుభంగిన్ జెప్పుఁ ద్రిభంగిన్.

పాదమునకు 34 అక్షరములు; 42 మాత్రలు; పూర్వార్థమున ప్రాసనియతి, పశ్చిమార్థమున మూడుచోట్ల అంత్యప్రాసనియమము ఉన్నవి. కావ్యాలంకారచూడామణి అప్పకవీయములలో సైతము ఇట్లే ఉన్నది. కానీ, కవిజనాశ్రయములోని త్రిభంగి ఇందుకు భిన్నముగా ఉన్నది.

నననలును నసభములును సగయుక్తము లైనన్
మృదువైనన్ బ్రస్తుతమైనన్
వసరుహభవనిభ! మనమలరఁ ద్రిభంగిని జెప్పున్
వడి దప్పున్ బ్రాసము లొప్పున్.

ఇందులో పాదమునకు 28 అక్షరములు; 36 మాత్రలు ఉన్నవి. పాదమున ప్రాసయతి నియమములేదు; మూడుచోట్ల అంత్య ప్రాసనియమము మాత్రమున్నది.

### నడక

కోట్లకొలది వృత్తములు పుట్టినా లాక్షణికులు సుమారు 200 వృత్తములకంటే ఎక్కువ పేర్కోలేదు. వాటిలో సుమారు 30 కంటే ఎక్కువగా కవులు వాడడములేదు. ఎందుచేత? లాక్షణికులు చెప్పిన లక్ష్యలక్షణపద్యములు చూచినా కొన్నివృత్తములనడక తెలియదు. పద్యములనడక ఏలక్షణముబట్టి ఉండునో ఆలక్షణరహస్యము తెలిసినయెడల వేలకొలది కొత్తకొత్తవృత్తములను ప్రస్తరించి తీయవచ్చును. ఆరహస్యము తెలియకపోవుటకు మన గణవిభజనసంప్రదాయము ముఖ్యమైన కారణము. మూడేసిఅక్షరములు గణమంటే

గణవిభజన పద్యము నడక బట్టి ఉండడ మసంభవము. నడక బట్టి గణవిభజనము ఉంటేనేగాని గణవిభజన ప్రయోజనము కనబడదు. కొన్నివృత్తములు చక్కగా నడిపించుటకు వీలున్నా లాక్షణికులు తమలక్ష్యపద్యములు వ్రాసినట్లు వ్రాయకపోవడముచేత కవు లావృత్తములను చెప్పడములేదు. అందుకు అనేక ఉదాహరణములు చూపించవచ్చునుగాని ఈ పీఠికలో అవకాశము చాలదు గనుక మూడు మాత్రమే చూపిస్తున్నాను.

(I) పాలాశదళము (దీనికే 'త్వరితగతి' యనికూడా పేరున్నది.)

అదనదనున హరినుతు+లమరు ధరఁ బాలా
శదళ మనఁ దనరుఁ గవి + జనులు వచియింపన్
బదునొకఁ డగునెడ యతి + పదిలమునఁ జేరన్
గదియు నగణము అయిదు + గగము తుదనొందన్. (అప్పకవి)

ఇంతకంటె అనంతుడు చెప్పినది బాగున్నదిగాని అందులో రెండవపాదము నాల్గవపాదము నడకచెడి యున్నవి (చూ. మూ. II.84) ఎట్లుండినయెడల నడక బాగుండునో తెలియజేస్తున్నాను:—

అయిదులము లయిదులము; +లయిదులములున్ గా
లయఁజనును ద్వరితగతి; + లములు పదిసాగన్
నియమమున వడియమర + నిలుచు శ్రుతికింపై
కయితలను దనరునిది + ఖగతురగశౌరీ.

2. విచికిలిత

ప్రవిలయసమయమునను బద + పడి జలనిధినడుము స
ద్భువనములు కడుపున నిడుక + భుజగపతిశయనముపై
నవిరమతి గురుకు వరదుఁ + డని విచికిలితఁ బదుమూఁ
డవ యెడ వడి యిరువదియొక +లఘువు గము బలుక నగున్. (అప్పకవి)

ఇటుంటి లక్ష్యలక్షణపద్యముబట్టి దీనినడక ఎట్లు తెలుసుకోగలము? ఇందులో 21 లఘువులున్ను చివరను గురువున్ను ఉన్నవి గనుక “తిశ్రగతి”ని[15] నడిపించవచ్చును. ఏడుహగణములున్ను గురువున్ను కలది సుగంధి ఏడునగణములున్ను గురువున్ను కలది విచికిలిత హగణనగణములలో ఏవైనా ఏడున్ను గురువున్ను గలది ఉత్సాహము. విచికిలిత నడక ఎట్లుండదగునో చూడండి:—

మునుల వలపు నబల బలము + ముదిమి సొగసు కలసిరుల్
చెనటి హితము విషము రుచియు+ చెఱలసుఖము పగహితుల్
తనివి తృషను కపికి స్థిరత + తమికి వెలుఁగు సెగవగల్
శనికి సుకృతి శిలల రసము + సవతి చెలిమి కలుగునే.

3. తురగము

నననననసజజగలు తిథివిరమ + ఱం బ గున్దురగంబునన్
గనలుచు నగరముపమ విడిసిన+గాంచి తానొక రుండెదు
ర్కొనిదవులకుఁగొని చనిగిరిగుహ్య + గూర్కు నాముచికుందుచే

తను యవనునిఁ బొరిగొని వని వసు + ధన్గణింతురుభూవరుల్ (అప్పకవి)

దీని నడకతీరు ఈలక్ష్యమును బట్టి కనుగొనుట శక్యమా?

ననల యుగళము హభము రగణము + నాల్గుపంక్తుల నొప్పగాఁ
దనరు విరమము ననల యుగళము + దాటగాఁ దుగంబునన్.

ఈలాగున లక్ష్యలక్షణపద్య మున్నయెడల ఈతురగవృత్తము తరళ మత్తకోకిల కరిబృంహిత వృత్తములవలె నడుచునని సులభముగా తెలుసుకోవచ్చును.

జాగ్రత్తగా విమర్శించి చూచినయెడల చక్కగా నడిచే పద్యములన్నీ ఏదో ఒకతాళమునకో ఒకలయకో సరిపడి ఉంటవి. విషయము బోధపడెవలెనని కొన్ని మాత్రమే ఉదాహరిస్తున్నాను.

1. తిశ్రగతిని నడిచేవి (అనగా మూడుమాత్రలగణములు గలవి) ఉత్సాహము, సుగంధి, విచికిలిత మొదలయినవి.

2. తిశ్రగతిని ఎదురుగా నడిచేవి (అనఁగా మృదంగవాద్యములో ఎదురువాద్యమువలె నడిచేవి) వీటిలో లఘువు తర్వాత గురువువచ్చును.

సుకాంతి, ప్రమాణి, పంచచామరము మొదలయినవి.

ఉ. “ఇదే యసిన్ మదాన్వితున్ సుదేవున్ వధించెదన్”

3. చతురస్రగతిని నడిచేవి (అనగా నాలుగుమాత్రలగణములు గలవి మత్త, తోదకము, ప్రకరణకలిత, మానిని, కవిరాజవిరాజితము, సరసిజము, క్రౌంచపదము మొదలయినవి; ఇవి గాక ఇంకా ఈగతిని నడిచే వృత్తములు వేలకొలది ప్రస్తరించి తీయవచ్చును.

ఇందుకు తార్కాణముగా పదియవఛందములో చతురస్రగతిని నడిచేపద్యము లెన్నిగలవో చూడండి:—

ఈ ఛందములో 16 మాత్రలుండి గుర్వంతముగా ఉండే వృత్తములు 126. వీటిలో నూరుపద్యములు చక్కగా నడుచును. అన్నీ ఇక్కడ చూపించుట కవకాశములేదు గనుక కొన్ని మాత్రమే చూపిస్తున్నాను.

| | | వృత్తసంఖ్య |
|---|---|---|
| (1) | IIII UU UU UU<br>నలగగగాగాల్ + నాళీకాక్షా | (16) |
| (2) | UII IIU UU UU<br>క్రాలునుభసముల్ + గాగాల్ పంక్తిన్ | (31) |
| (3) | UU IIII UU UU గాపై<br>నలగగ+గంబుల్ రెండున్ | (61) |
| (4) | UU UII IIU UU క్రాలున్<br>గాభస + గగముల్ పంక్తిన్ | (121) |

(5) UU UU IIII UU గాగా (241)
నల్గాల్ + క్రమమున నిల్చున్

(6) UU UU UII IIU పంక్తిన్ (481)
గాగా+భంబుసగణమున్

(7) IIU IIU UU UU ససగా (28)
గగముల్ + సాగున్ శౌరీ

(8) UII UII UU UU (53)
భాగగగాల్ చను +
పాదంబందున్

(9) UU IIU IIU UU గాసా (109)
గగముల్ +గలుగున్ బంక్తిన్

(10) UU UII UII UU గాభా (217)
గాలయి + గ్రాలున్ శౌరీ

(11) UU UU IIU IIU శౌరీ గాగా (433)
+ ససముల్ వరలున్

4. చతురస్రగతిని ఎదురుగా నడిచేవి. (అనగా జగణములు గలవి) ప్రమితాక్షరము, జలోద్ధతగతి, మంజుభాషిణి మొదలయినవి.

5. ఖండగతిని నడిచేవి (అనగా 5 మాత్రల గణములు గలవి). త్వరితగతి, పద్మనాభము, లయగ్రాహి, దండకము మొదలయినవి.

6. ఖండగతిని ఎదురుగా నడిచేవి. (అనగా యగణములు గలవి). భుజంగప్రయాతము ఇటువంటివి అనేకముగా లేవు.

7. రూపక తాళమునకు సరిపడే వృత్తములు (అనగా మాత్రలకు విరుగుతూ నడిచేవి).

మదరేఖావృత్తము:— ఇట్టివి అనేకముగా లేవు; గాని, కావలసినన్ని సులభముగా కల్పించవచ్చును. చూడండి:-

I. అనుసారిణి యనువృత్తం + బగునతివృతి యను ఛందం
బున రూపక మనుతాళం + బున నడుచును శ్రుతి కింపై
చను నాలుగుచరణంబుల్ + సన యననస గము లొప్పన్
ననయంబులు చనునంతన్ + జరణములను వడి నిల్చున్.

II. రూపక మనుతాళంబున + ద్రుతలఘువులు చనుచుండున్

III. నలగముపై సగ మొప్పున్ + నలగమముల్ జోడింపన్

IV. క్రాలున్ తల నలలల మస + గంబుల్ పాదములందున్

V. కల్యాణిన్ మనలలలస + గభగంబుల్ పాదములన్

ఈలాగున క్రొత్తక్రొత్తవృత్తములను ఎన్నైనా తీయవచ్చును.

8. మిశ్రగతిని నడిచేవి (అనగా 3+4 మాత్రలకు విరుగుతూ నడిచేవి).

మత్తకోకిల, తరళ, తురగము మొదలయినవృత్తములు; వృషభగమన, హరిణగతిరగడలు (గురుజాడ అప్పారావు గారి ముత్యాలసరములు మొదలయిన

పద్యము లీగతిని నడుచును).

9. త్రిపుటతాళమునకు (చతురస్రగతి తిశ్రజాతి త్రిపుట 4(3+2+4)=28) ఉత్పలమాల, చంపకమాల నడుచును.

10. ఆదితాళమునకు (చతురస్రగతి చతురస్రజాతి త్రిపుట) కందము, సరసిజము, క్రౌంచపదము మొదలయినవి.

ఈలాగున ఇంకా విమర్శించి చెప్పవచ్చును.

పాదమందుండే అక్షరముల సంఖ్యబట్టి ఛందము లేర్చరిచి ఆఛందములలో ఒకొక్కటి ప్రస్తరించి వృత్తములు కల్పించడమువల్ల ప్రయోజనము విశేషముగా కనబడలేదు. అంతకంటె శ్రుతి కింపుకొలిపే నడకకు ఆధారమైన లక్షణముబట్టి తిశ్రగతిచ్ఛందము, చతురస్రగతిచ్ఛందము మొదలయిన ఛందము లేర్పరిచి పద్యములు చెప్పుటవల్లను ప్రయోజనము విశేషముగా ఉండుననిన్ని అట్లు ఏర్పడిన పద్యములు తెలుగుభాషకు అమరి ఉండుననిన్ని నాయభిప్రాయము. వృత్తములలో ప్రతిపాదములోను గణములు ఒక్కలాగుననే ఉండవలెనన్న నిర్బంధ మున్నది. దానివల్ల ప్రయోజనమేమో!

అయితే లయకు సులువుగా విరిగేటట్లున్న పద్యములకంటె లయ ఉండిన్నీ కనబడకుండా ఉండేపద్యములు అప్రతిహత మైన నడకకు అనుకూలముగా ఉంటవి. ఇటువంటివి ఉత్పలమాల, చంపకమాల, శార్దూలము, మత్తేభము. ఇవి ఏదో ఒక తాళమునకు లొంగే ఉన్నవి.

ఉత్పలమాల చంపకమాల పాదములు చతురస్రగతి చతురస్రజాతి త్రిపటతాళమునకు సరిపోవును. శార్దూలమత్తేభములు మత్యతాళమునకు చదువవచ్చును.

ఇటువంటివృత్తములు విశేషముగా లేవు. ప్రస్తరించి కల్పించుట కూడా కష్టముగానే ఉన్నది. శోధనకోసము నేను వ్రాసినవాటిలో ఒకటి చూపిస్తున్నాను.

### కవికాంత

శూరుఁడు వీర్యపరాక్రమోన్నతుఁడు +
సుశ్లోకుండు జనార్దనుండు కం
సారి మురాసురవైరి మాధవుఁడు +
సౌమ్యుం డంచు హరి న్నుతింపఁగా
భారనమ స్జగ ముంచి విశ్వయతి +
పాటింపన్ గవికాంత యాకృతిన్
సూరిజనస్తుతవృత్తమై తనరు +
సొంపారన్ గవి చెప్పఁ గల్గినన్.

ఇది ఆకృతి యనే 22 వ ఛందమున పుట్టిన 141279 వ వృత్తము. ప్రతిపాదము చతురస్రగతి ఆదితాళమునకు సరిపోవును. పరిచితిగలవృత్తములవలె చదువబోయినవారికి నడక చెడినదన్నభ్రమ కలుగును గాని రెండు మూడు సార్లు చదివిన పిమ్మట దీనినడక పట్టుపడగలదు. దీనిలో మొదటనున్న భగణము నలముగాను యతిస్థానమందున్న మగణము సగముగాను మార్చి క్రొత్తవృత్తములు చేసుకోవచ్చును; దీనివలెనే నడిచేవృత్తములు మరికొన్ని చెప్పవచ్చును.

ఈకవికాంతాపాదములు చతురస్రగతి చతురస్రజాతి త్రిపుటతాళమునకు (అనగా క్రియకు నాలుగు అక్షరములు చొప్పున ఆదితాళము 4 x ( 4 + 2 +2)=32 నరిగా నడుచును.[16]

## టిప్పణి

1.7. “లఘువగు...యొకమాత్ర; గురువు నొదవు ద్విమాత్రన్" ఈ విషయమును గూర్చి జయంతి రామయ్యపంతులుగారు వ్రాసినది అశాస్త్రీయము.

“వ్యంజన మర్ధమాత్ర యనున్యాయముచే 'వనిత' అనునప్పుడు 'తన్' అనుగురువు సార్ధమాత్రక మగును; 'అనగాన్’ అనుచో “గాన్” అనుగురువు సార్ధద్విమాత్రకమగును” అని వ్రాసినారు.

ఈసందర్భమున “మాత్రా”పరిమాణము అచ్చునుగూర్చి చెప్పవలెనుగాని వ్యంజనమును గూర్చి చెప్పకూడదు. అచ్చులబట్టి (syllables) అక్షరము లేర్పడును గాని, వ్యంజనములబట్టి ఏర్పడవు. 'భ్రన్’ లో ఎన్నివ్యంజనములున్నా అచ్చు ఒక్కటే గనుక అది ఒక్క (syllable) అక్షరమనే చెప్పవలెను.

‘వనిత' అనునప్పుడు చివరనున్న హ్రస్వాచ్చుపై నిల్చిన నకారపొల్లు ద్విగుణోచ్చారణ కలదియని చెప్పవలెను; గాని దానికి మాత్రాపరిమాణము చెప్పకూడదు, 'అనగాన్' అనునప్పుడు దీర్ఘాచ్చుపై నున్న నకారపొల్లుకు ఈద్విగుణోచ్చారణము లేదు. ఎంతమట్టుకు అజ్ దీర్ఘోచ్చారణప్రయత్నము ఎక్కువై ఉంటుందో అంతమట్టుకు వ్యంజనద్విగుణోచ్చారణ ప్రయత్నముతగ్గును. గనుక ‘త'న్ ‘తాన్’ ‘తంత్’ ‘తాంత్ 'వీటి అన్నిటిలోను తకారముపై నున్న అచ్చు రెండుమాత్రల గురువేగాని భిన్నముకాదు. అయితే వీటిలో వ్యంజనమునకు పూర్వమందున్న హ్రస్వాచ్చు ఎందుకు రెండుమాత్రల గురువైనదంటే: ఎప్పుడైనా ఉచ్చారణప్రయత్నమును బట్టి అచ్చుకు మాత్రాపరిణామము చెప్పవలెను. 'తన్' అనునప్పుడు తకారముమీది అకారము ఉచ్చరించినప్పుడు వెంటనే నకారోచ్చారణ చేయవలసి వచ్చుటచేత స్వరోచ్చారణప్రయత్నము ద్విగుణమైనది. అందుచేత 'తన్' రెండుమాత్రల గురువుగా చెప్పవలెను.

I. 20 ఈపద్యములో నాల్గవపాదము చక్కగా అర్థము కాలేదు. “నగణ పునరుక్తి నొక్కటి డిగియె” అంటే చంద్రగణ ములు ప్రస్తరింపగా కడపటి IIIII (నలలము) ఒక లఘువు తక్కువగా రెండునగణములని అర్థముకావలెను.

“ఇరువది తొమ్మిదింట” అంటే అర్థము పొసగలేదు.

21-22. "ఈ పద్యములకు నర్థము సంశయముగా నున్న”దని 6 వ పుట అడుగున మూలములో ఉన్నది. అయితే 21వ పద్యము పరవస్తువారి ప్రతిలో.

క. జగణము నలుగు గగములు
భగణము లగుగలము నగణభావంబు గనున్
నగము నగణగణము లగు
తగణము భలమగును సంయుతముఁ దీర్చినచోన్.

అని ఉన్నది. దీని అర్థము స్పష్టము. IUI=IIII; UU=UII; UI=III; IIUU=IIIIU; UUI=UIII.

22వ పద్యము పైపద్యములోని విషయములకు ఉదాహరణములు గలది గాని అర్థము పొసగలేదు.

మొగిళులు నలమగు, నిటులన్
సగణము నగణమగు నిటుల + నంగునితండ్రీ
భగణము పాళు లనంగా
తగణము వాకిళ్లు భలము వాకిళు లనఁగన్.

అని ఉంటే అర్థము కావచ్చును. పరవస్తువారిప్రతిలో మొదటిపాదమున్ను, రెండవపాదములో యతిస్థానమువరకున్ను నే నుదాహరించినట్లే ఉన్నది; తర్వాత మూలములో ఉన్నట్లే ఉన్నది.

67. “దశరథాత్మజుఁడు స్వామి ధాత్రి కనఁగ" ఇందులో ద్విత్వమునకు పూర్వమందున్నది గనుక 'డు' ఊది పలుకవలెననిన్ని గురువుగా పలుకవలెననిన్ని అనంతుడు వ్రాసినాడు; గాని ఇది ఇతరలాక్షణికుల సమ్మతము కాదు. తెలుగులో పదాదినున్న ద్వి త్వమునుబట్టి వ్యస్తముగా ఉన్న పూర్వపదాంతవర్ణము గురువుకాదని తక్కినలాక్షణికుల మతము. 94. టీక వ్యావహారిక భాషలోనే ఉన్నది.

"... యిరువదిన్ని... స్వరయతియైనాను, వ్యంజనయతియైనాను ప్రయోగించతగును" అనే ఉన్నది. ఇందులోనే కాదు. అప్పకవీయము మొదలయినలాక్షణికగ్రంథము లన్నింటిలోను ఇట్లే వాడక భాషను టీకలు వ్రాసినారు. అనవసరముగా నిరాధారముగాను భాషమార్చి అచ్చువేయడము ఆచారమైనది.

101. ఈ పద్యము మూలములో తప్పుగా ఉన్నది. సరియైనపాఠము:-

"తే. అఱ యనంగను బోవుట + కర్థమైన
సంధి నిత్యసమాసోక్తి+జరుగు రెంట
నసురవీరుల నెల్ల ను+క్కఱ వధించె
భానుకులుఁడు రావణుని నే+ పఱిచె ననఁగ

ఈ పాఠము అప్పకవీయములో ఉన్నది. (చూ. వావిళ్లవారి ప్రతి పు. 142)

IV. 22 వ పద్యమైన తర్వాత పరవస్తువారిప్రతిలో ఈక్రిందిపద్య మున్నది.

కోమటీంద్రునాఁగ భూమితీరనఁ బలు
గ్రహము లనఁగ వానకాల మనఁగ
వైరివర్గమైన వదల రిట్టివి లోక
రూఢిఁ జెల్లు నని సరోజనాభ.

IV. 107 “తనరఁగ అఆ ఇఈ లనఁగా ఉఊలు నాఁగ....' ఈ పద్యములో హ్రస్వాక్షరములే అయినా 'అ' 'ఇ' 'ఉ' 'ఋ' గురువర్ణములుగానే ఉచ్చరించవలెను. అది ఎట్లు జరుగునంటే: ఈహ్రస్వాక్షరము లుచ్చరించిన తర్వాత ఏకలఘుమాత్రాకాలము ఊపిరి ఆపి, ఆ బిగపట్టి పైవర్ణము లుచ్చరించుటచేత, ఈహ్రస్వాక్షరోచ్చారణలో ద్విమాత్రోచ్చారణప్రయత్నము జరిగినది.

అంతేకాని పరమందున్న 'ఆ' అనే అచ్చు ద్విత్వాక్షరమువలె ఉచ్చరించుటచేత

పూర్వమందున 'ఆ' గురువు అగునని జయంతి రామయ్యపంతులు గారు చెప్పిన సమాధానము అశాస్త్రీయము. అచ్చువిషయమున ద్విత్వాక్షరోచ్చారణమంటే దీర్ఘోచ్చారణమని చెప్పవలెనేకాని వ్యంజనముల విషయమై చెప్పిన అ ర్థముపొసగదు. ద్విత్వవ్యంజనమునకు పూర్వమందున్న హ్రస్వాచ్చు గురువు కాగలదుగాని కేవల దీర్ఘాచ్చునకు పూర్వమందున్నహ్రస్వాచ్చు గురువు కాలేదు.

ఈ ఛందోదర్పణమునకు ముఖబంధనముగా ఉపోద్ఘాతమును వ్రాయవలసినది అని నన్ను కోరి గౌరవించినందుకును ఛందోవిషయముల గూర్చి నా యభిప్రాయములను తెలియజేయుటకు నా కవకాశము ఇచ్చినందుకును నా మిత్రులు బ్రహ్మశ్రీ. వావిళ్ల, వేంకటేశ్వరులుగారికి నాకృతజ్ఞతావందనములను సమర్పించుకొంటున్నాను.

ఇట్లు

పర్లాకిమిడి.
గిడుగు వెంకట సీతాపతి

1-6-1921.
పర్లాకిమిడి రాజావారి కాలేజీలో లెక్చెరరు.

1. 1917- పుట 362, ఆంధ్రకవులచరిత్ర, రెండవకూర్పు.

2. సంజ్ఞా -88

3. ఈ భీమనాగ్రసుతుఁడు 'అగస్త్యభ్రాత' లాటివాడు; ఎవరో తెలియదు. "భీమన ఛందస్సన్న" పేరు గలిగి మనకు కనబడుచున్న వ్రాతప్రతులలోని గ్రంథము రచించినవాడు భీమనాగ్రసుతుడు; గాని, భీమనకాడు. వ్రాతప్రతులన్నిటిలోను భీమనఛందస్సు కలగూరగంపగా ఉన్నది. తక్కినఛందోగ్రంథములలోని లక్షణములున్ను ఉత్తరాంధ్రకావ్యములలోని లక్ష్యములున్ను ఉన్నవి. కొన్నిటిలో భీమనమతము స్పష్టముగా నిరాకృతమయి ఉన్నది. ఈ భీమనాగ్రసుతుడో, ఆపేరిటివాడు వేరేమరియొకడో, 'సర్వలక్షణసార' మనుగ్రంథము రచించినట్టు తంజావూరి సరస్వతీమహల్ పుస్తకాలయములో 327-వ నెంబరుగుల వ్రాతప్రతినిబట్టి కనబడుచున్నది. అందులో "పరగిన విమలయశోభాసురచరితుఁడ భీమనాగ్రసుతుఁడ" అని గ్రంథకర్త వ్రాసుకొన్న పద్యమున్ను ఇంకా 'భీమనఛందస్సు'లో ఉన్నట్లే అనేకపద్యములున్ను ఉన్నవి. 17-వ శతాబ్దారంభము నాటి మల్లన రచించిన చంద్రభానుచరిత్రలోని పద్యమున్ను ఇంకా మరికొన్ని కావ్యములలోని పద్యములున్ను ఉదాహృతమై ఉన్నవి. దీనినిబట్టి చూడగా భీమన 16వ శతాబ్దాంతమునాటివాడు కావలెను. కళింగదేశము రాజయిన రాజరాజు 11 వశతాబ్దము వాడుగదా? ఈ భీమన ఆరాజరాజును తనకవితామహిమచేత గద్దెమీదనుండి పడద్రోసి తిరిగీ గద్దె నెక్కించడము ఎట్లు సంభవమగును? ఈకవితామహిమానువర్ణముగల రెండు చాటుపద్యములు మాత్రమే ఆధారముగా చేసుకొని భీమన రాజరాజనాటివాడనిన్ని భీమనఛందస్సు ప్రాచీనతమమయినదనిన్ని చెప్పుటకు శ్రీరామయ్యపంతులుగారు సాహసించడము

వింతగా ఉన్నది. కవిజనాశ్రయములోనివి కావని తమకు తోచినవి ప్రక్షిప్తములని చెప్పి కొన్ని, చెప్పక కొన్ని, గాలించి తీసివేసి, కొంతభాస తమకు తోచినట్లు మార్చి, భీమనఛందస్సులో మిగిలి ఉన్న పద్యాలు 'అసలు' కవిజనాశ్రయమని పంతులుగారు ప్రకటించినారు. ఇది ఆంధ్రసారస్వతమునకు కొంత ఉపచరించినదని కృతిజ్ఞతతో ఒప్పుకుంటూ, ఈ గ్రంథము మరికొన్ని ప్రతులసాయమున చక్కగా విమర్శించి సంప్రతించి అచ్చొత్తించుట అగత్యమని తెలియజేయుచున్నాను. పంతులుగారి పరిష్కరణములోని దోషములు రెండువిధము లయినవి. i. గ్రంథములో చేరకూడని పద్యములు చేర్చినారు. ఉదా. 1. సంజ్ఞా. 90, 91, 92 ఇవి కావ్యాలంకారచూడామణియందున్న పద్యములు "ప్రక్షిప్తము లైనవేమో యని సంశయింపఁదగియున్న" దని కిందను వ్రాస్తూ గ్రంథమున చేర్చివారు. 2. ఉత్తమగండచ్ఛందములోనిది, "సభలం జెప్పిన" అనేపద్యము (46). ఇందులోని విషయములు పూర్వపద్యములలోని (38, 39) విషయములకు విరుద్ధముగా ఉన్నవి. 3. అవతారిక పద్యములు. అనంతచ్ఛందములోని పద్యములు; ii. గ్రంథములో చేరవలసినవి విడిచినారు: ఉదా. విశ్రాంతివిరతి అనేకందమునకు బదులుగా "రేచనకీర్తి గలుగు" అనేమాటలు గల గీతపద్యము చేర్చుకోవలసియుండెను. ఇంకా ఇటువంటివి ఉన్నవి.

4. చూ. అప్పక. అనంత. 123.

5. చూ. అప్పక, అనంత. 123.

6. శృంగారనైషధ. III. 120. టీ. "నముచి దమనుండు పుత్తించినాడు"లో యతి తప్పని బ్ర|| వేదము వేంకటరాయశాస్త్రులవారు దిద్దినారుగాని, ఈపాఠమే వ్రాతప్రతులలో ఉన్నది. తిక్కన ఇట్టి యతులు వాడినారు. చూ, శాంతి. II. 87. "నాకు దక్షిణగా నిచ్చివాఁడవింక; అశ్వ 1. 45 నాదు గుఱుతు సెప్పినా రెవ్వరనినను." గనుక తప్పుకాదు.

7. ప్రాకృతభాషలలోను, పాలీలోను ఋకారము కొన్నియెడల ఇకారమయినది. అరవములో కృ=కిరు, తెలుగులోను, కన్నడములోను కృ=క్రి.

8. కొందరు లాక్షణికులు ఎన్ని అక్షరములయిన తర్వాత వడి ఉండునో ఆసంఖ్య తెలియజేతురు. కొందరు ఎన్నవఅక్షరము వడి గలదో ఆసంఖ్య తెలియజేతురు. సంకేతభేదమేగాని, స్థితి ఒకటే.

9. జయంతి రామయ్యపంతులుగారిచే పరిశోధితమై ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచే ప్రకటితమైనప్రతిలో "కామనిభా" అని ఉన్నది; గాని నావద్దనున్న ప్రతిలో "రామనిభా" అని ఉన్నది. పరిష్కర్తలు తమవద్ద నున్న ప్రతులలోని పాఠము నిచ్చివారుకాబోలు. కవిజనాశ్రయములో వడి గురించి లక్షణమున ఏమి చెప్పియుండలేదు; గాని లక్ష్యలక్షణపద్యములో అప్పకవి చెప్పినట్లు మొదటిపాదమున వళ్లు ఉండడము చేత రెండవపాదమునకూడా అట్లే ఉండవలెనని తోచును.

10. ఆంధ్రచ్ఛందస్సులు, ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సంపుటం 8 సంచిక 2.

11. వారివాదము ననుసరించి 'IUI' కూడా ఇంద్రగణములలో ఉండవలెను. పు. 88 లో ఉన్న ప్రస్తారపట్టికలో లేదు; వ్రాయమరచినారో? అచ్చుతప్పో? వారిమతమున శాసనాక్కరలలో "క్రమంబున| దానిక..."అనేపాదమం దీగణమున్నది.

12. శాస్త్రులవారు క్రొత్తగా తెచ్చిపెట్టిన ఇనేంద్రగణములు సీవములు మొదలయిన తక్కిన తెలుగుపద్యములందు ఉపచరించునా?

13. 'కరుఁడయి' అని కొన్నిప్రతులలో ఉన్నది; గానీ కరుఁడై అనియైనను

ఉండవచ్చును.

14.'రక్షించుఁ బ్రీతి' అని కొన్ని అచ్చుప్రతులలో ఉన్నది గాని వ్రాతప్రతులలో అనుస్వారమున్నది.

15.అనగా మూడుమాత్రలకు విరుగుతూ ఉంటుందని అర్థము. త్రి+అస్ర=త్ర్యస్ర అని ఉండవలెను గాని సంగీతపుస్తకములలోని వ్యవహారము ననుసరించి 'తిశ్ర' అని వాడినాను.

16. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో “ఛందోరహస్యదర్పణము — పద్యరచనావ్యవస్థ” అను పేరుగలవ్యాసములో ఇక్కడ సంగ్రహించి చెప్పిన విషయములు కొన్ని విపులముగా చర్చించినాను.



శ్రీ రామాయనమః.

# ఛందోదర్పణము

## ప్రథమాశ్వాసము



### ఇష్టదేవతా స్తుతి



రామా స్తనమండలీమిళిత కా-శ్మీరార్ద్ర వక్షంబుతోఁ
బారావారతరంగసంగత లస-త్పర్యంక నాగంబుపైఁ
గారుణ్యామృత పూరపూరిత కటా-క్షశ్రీలఁ బెంపొందు గం
భీరస్వాంతుఁ డనంతుఁ డాశ్రితజనా-భీష్టప్రదుం డయ్యెడున్. 1

అతని దశావతార విభవాతిశయంబున లోకమెల్ల శా
శ్వత మగుచాడ్పునన్ భజన సమ్యతరల్ల దశాక్షరాభిశో
భితమగు వాక్ప్రపంచమది పెద్దయుఁ బ్రస్తుతి నొందనట్టిచో
నతఁడును నమ్మహాక్షరచయంబు జయంబు నొసంగుఁగావుతన్. 2

క. శ్రీవల్లభు యతిగణసం
సేవిత పాదారవిందుఁ జింతితఫలదున్
భావజగురునలఘుచ్ఛం

దోవినుతు ననంతశయనుఁ దోయజనాభున్. 3

క. ఛందోరీతిగ విమల
చ్ఛందుఁ డనంతుం డొగిం బ్రశంసించి కృపా
మందిరులగు శ్రీమద్గో
విందగురు ప్రభులదయఁ బ్రవీణుండగుచున్. 4

## ఛందః ప్రాశస్త్యము

క. విద్యలలోపల నుత్తమ
విద్య కవిత్వంబు మఱి కవిత్వము ఛందో
వేద్యము గావునఁ జెప్పెను
హృద్యంబుగఁ గవితచందమేర్పడఁ గృష్ణా! 5

# సంజ్ఞా ప్రకరణము

## గద్య పద్య లక్షణము

ఆ. పరఁగుఁ గవితగద్యఁపద్యంబు లనఁ బాద
కల్పనంబువలదు గద్యమునకు
పాదనియతినొప్పుఁ బద్యంబు లవియు వృ
త్తములు జాతు లనఁగ నమరుఁ గృష్ణ! 6

## గురు లఘు నిర్ణయము

క. వృత్తంబులు గణబద్ధము
లుత్తమమగు జాతులెల్ల నొనరఁగ మాత్రా
యత్తంబులు లఘువగుఁ బురు
షోత్తమ యొక మాత్ర గురువు నొదవు ద్విమాత్రన్. 7

క. వివిధముగఁ జాఁపిపలికెడు
నవియును మఱియూఁది పలుకునవియును గురువుల్
భువి నిలిపిపలుకు వర్ణము
లవియెల్లను లఘువులయ్యె నంబుధిశయనా! 8

క. గురు వమరు నూర్ధ్వపుండ్రము
ధరియించినరీతి, లఘువు దనరును హరియొ
క్కరుఁడ పరతత్త్వ మనుచును
సురుచిరముగఁ జుట్టివ్రేల జూపినమాడ్కిన్. 9

క. గోవిందప్రభుఁ డనినన్
గోవిదు లవి మూఁడుమూఁడు గురులఘువులుగా
భావింతురు గురులఘువులు
మోపఁగ మూఁడేసి నిక్కముగ గణములగున్. 10

## గణాష్టక లక్షణము

క. భజన సమయరతగణములు
భజన సమయరతములై సభక్తికమతిఁ బం
కజనాభు నహర్నిశమును
భజించు దిక్పాలగణవిభూతిఁ దనర్చున్. 11

గీ. గురులఘువు లోలిమూఁడేసి కూడిన మన,
లాదిమధ్యావసానంబులందు గురువు
లొందు భజసలు, లఘువు లట్లొంద యరత
లనఁగ నయ్యష్టగణము లొప్పును ముకుంద! 12

క. చను మగణము 'శ్రీనాథా'
యనిన, 'ముకుందా' యనంగ యగణము, రగణం
బన నొప్పు 'మాధవా' యన,
నొనరఁగ 'వైకుంఠ' యనఁగ నొగిఁ దగణమగున్. 13

క. భగణమగు 'విష్ణుఁడ'నఁగా,
సగణితముగ జగణ మగు 'మురారి' యనంగా,
నగణము 'విభుఁ డ'నిపలికిన,
సగణము 'వరదా' యనంగ సత్కృతులందున్. 14

క. గురువును లఘువును లఘువును
గురువును హవలగును, గలలు గురులఘుసంజ్ఞల్
వరుసను గగ లల గణముల
కరయఁగ వర్ణములు ద్విగుణమై యొప్పు హరీ! 15

క. 'శౌరి' యనిన హగణంబగుఁ,
జేరి 'హరీ' యనఁగ నుల్లసిల్లును వగణం
బారయఁ 'గృష్ణా' యనినను
ధారుణి గగ మండ్రు, లలము దా 'హరి' యనినన్. 16

సీ. 'కమలనాభా' నగగంబు 'కమఠరూప' - నహ 'మసురాంతక' నాఁగ సలల,
'మద్రిధర' భలంబు 'భద్రయశా' యన్న - భగురు 'వంభోజాక్ష' మగణలఘువు,
'భువనేశ్వరా' యన్న సవ 'మఘవిద్వేషి' - సహము 'పీతాంబర' సంజ్ఞ తలము,
'కైటభారి' రలంబు 'గజవరదా' యన్న - నవ 'మహిశయన' నా నలలమయ్యె
ఆ. రగణగురువు 'దేవరాజా'యనంగఁ 'బ
ద్మావతీ' యనంగ దగణగురువు
'నరహరీ' యనంగ 'నరహరి' 'నరసింహ'
నాఁగ నొప్పు నగము నలము సలము. 17

## ఇంద్రచంద్రాది గణభేదములు

క. ద్విత్రిచతుర్గురుభవముల
ధాత్రీధర రెండు మడఁపఁ దక్కినగణముల్
మిత్రేంద్రచంద్రు లనఁ జను

మాత్రాదిగణంబు మొదల మాత్ర లిడంగన్. 18

క. గలనగణము లినుఁ; డింద్రుఁడు
నలనగసలభరత, లింక నగగ నహ సలా
భల భగురు మలఘు సవ సహ
తల రల నవ నలల రగురు తగ లిందుఁ డజా! 19

గీ. ఒక్క నెలవున నెనిమిది యొకట నాల్గు
వెండి లఘువెక్కినవి నాల్గు వీనిలోన
నగణపునరుక్తి నొక్కటి డిగియె నౌల
దొంతి పదునాల్గు నిరువదితొమ్మిదింట. 20

## సంయుక్త వర్ణ గణంబులు

క. జగణము నలమగు గగములు
భగణములగు గలము నగణభావంబుఁ గనున్
సగము నగణ వగణములగుఁ
దగణము భలమగును సంయుతముఁ దీర్చినచోన్! 21

క. మొగిళులు నలమగు నిటులన్
నగణము సగణమగు నిటు లనంగుని తండ్రీ!
తగణము పాళు లనంగా
భగణము వాకిళ్ళు భలము వాకిళులనఁగన్. 22

## గణ ఫలములు

నవ్యసుఖప్రదాయి భగణంబు, జకారము రుక్ప్రదంబగున్,
ద్రవ్యముఁ జేయు నా, లయకరంబు స కారము, మా శుభంబు, యా
దివ్యసువర్ణకారి, వెతఁదెచ్చును రేఫ, విభూతినిచ్చుఁ దా,
గావ్యములందు నాదినిడఁ గర్తకు భర్తకు నంబుజోదరా! 23

## గణాధిదైవతములు

భగణము నేలుఁజందురుఁడు, భానుఁడు దా జగణంబు నేలుఁ, దా
నగణము నేలు నిర్జరగణంబుఁ, సమీరణుఁ డేలు నెప్పుడున్
సగణము, నుర్వియేలు మగణంబు, నొగిన్యగణంబుఁ దోయమున్,
రగణముఁ బావకుండుఁ, దగణంబు నభంబును నేలుఁ, గేశవా! 24

## కృత్యాది వర్జనీయ గణములు నక్షరములు

క. పుర, శర, రస, గిరి, రుద్రుల
నరయ నకచటతప లిడుట యనుచిత మయ్యు
క్షరములును రసభజంబులుఁ
బరిహరణీయంబు లాదిఁ బంకజనాభా! 25

క. మొదలును కఖజలు చఛడలు
దధలును భయశక్షసలు తగ వుపవర్ణా

స్పదములు గాకుండిన మే
లొదవించును స్వరములెల్ల నుత్సవకారుల్. 26

క. మొదల నభంబులు రెండును
గదిసిన విభవంబు తభసగణసంగతి యొ
ప్పదు రయముల నధికశుభం
బొదవును భయములను హానినొందు నృసింహా! 27

క. ఒనరఁగ శుభవాచకములు
ఘనతరమగు దేవవాచకంబులు నై పే
ర్చినగణములు వర్ణంబులు
ననింద్యములు కృతుల మొదల నహిపతిశయనా! 28

## ప్రాస ప్రకరణము

క. ప్రాసం బగు రెండవయది
వాసనగల మొదలి వ్రాయి వడి యనఁబరఁగున్
బ్రాసంబు లన్ని యెడలను
బాసురముగ వడులు పాదపాదముల హరీ! 29

క. ఆదిని గురులఘువులలో
నేది నిలిపె నదియె మొదల నిడి పాదము లు
త్పాదింపవలయు నుపజా
త్యాదుల మిశ్రములఁ దక్క నంబుధిశయనా! 30

ఆ. కుటిలకుంతలములు నిటలంబుపైఁ దూల
నోట లేక ధేనువాటమునకు
నదె యశోదపట్టి కదలెఁ బొమ్మనినఁ బ్రా
సాది తేటపడుఁ బ్రమోద మొసఁగ. 31

ఆ. నందనుతుఁడు నాఁగ సౌందర్యనిధి యన
నమరు బిందుపూర్వకము మొదలను
బక్షిగమనుఁ డన నధోక్షజుఁ డన సంయు
తాక్షరాది చెల్లు నసమగురువు. 32

ఆ. అర్ధబిందుసహిత మగువర్ణమునకుఁ బ్రా
సాదీ యరయ నిడుదయక్కరంబు
నేఁడు మనకుఁ గల్గినాఁడు లక్ష్మీనాథుఁ
డేఁటి కింక నేఁడు మాట లనఁగ. 33

ఆ. కుఱుచమీఁదిసున్న మఱి తేల వ్రాయఁ బ్రా
సద్వయాది నిట్లు జరగు నచ్యు
తుఁడు సమస్తవల్లభుఁడు నాఁగ నయ్యచ్యు
తుండు సకలవల్లభుండనంగ. 34

## ద్వాదశవిధ ప్రాసములు

క. సమనామ ప్రాసము ప్రా
సమైత్రి ఋత్రిలును ప్రాది సమలఘువు వికి
ల్పము బిందు వర్ధబింబ్వా
ఖ్య ముభయ సంయుక్త సంధిగత సంజ్ఞికముల్. 35

సమ ప్రాసము

క. అరసున్నలు నెఱసున్నలు
నొరసినవర్ణములు జడ్డయును దీర్ఘమునున్
బెరసినచో సమవర్ణము
లరసి నిలుపవలయుఁ దోయజాసనజనకా! 36

క. వరువడిఁ బ్రాసములు సమా
క్షరసంశోభితములయినఁ, జాలును మఱి త
త్స్వరవైసాదృశ్యంబులు
పరిహరణీయంబు లందుఁ బంకజనాభా! 37

ఆ. వీఁడె కృష్ణుఁ డల్లవాఁడె ప్రలంబారి
కొండ యెత్తె నితఁ డతండుద్రవ్వె
నొడ్డగెడవుగాఁగ దొడ్డరా జేలెడి
వీడుఁ నాఁగ బ్రాస మీడువచ్చు. 38

గీ. ఆయుపేంద్రుని బొడఁగాంచు టేయుపాయ
మనెడు దీర్ఘాదు లచట హ్రస్వాదు లయిన
నయ్యుపేంద్రుని బొడఁగాంచు టెయ్యుపాయ
మన సమప్రాస మగు నూఁదఁజనదు రహల. 39

ప్రాస మైత్రి

గీ. లళలు రెండును నొండొంటఁగలసి వచ్చు
నమరు నన్యోన్యమును ఋయుతాయుతములు
బిందుపూర్వమై తమలోనఁ బొందు బమలు
ప్రాసమైత్రికి నిది స్వరూపంబు దెలియ. 40

ఆ. నీలవర్ణు గర్భగోళంబు నందు లో
కంబు లెల్ల నుండు నెమ్మితోడ
శ్రీకినొడయఁ డుజ్జ్వలాకృతి యితఁ డన్నఁ
బ్రాసమైత్రి యిట్లు పరంగుఁ గృష్ణ! 41

గీ. తగ ఋకారాన్వితంబు ద్విత్వంబు గాఁగఁ
బరఁగు నచ్చుపుజడ్డతోఁ బ్రాసమైత్రి
యక్కృపానిధి హరిఁగని మ్రొక్కి రనఁగ
సంభృతాశ్రితుఁ డతిశయోజ్జృంభుఁ డనఁగ. 42

ఋ ప్రాసము

క. అరయ స్వరగణ మయ్యు ఋ
కారము ఋప్రాస మనఁగఁ గదియును రేఫన్
జేరి తనయురముఁ దన్నిన
యాఋషిపాదంబుఁ బిసికె నచ్యుతుఁ డనఁగన్. 43

గీ. తెల్లమిగ ఋకారము యణాదేశవశత
రేఫ యగుఁట బ్రాసంబయ్యె రేఫ కిట్టు
లిదియె పరవర్ణయుత మయ్యెనేని ప్రాస
మైత్రి యగుఁ గాని రేఫసంబంధి గాదు. 44

త్రి ప్రాసము

గీ. సంఖ్యఁ బలుకుత్రికారంబుఁ జనుఁ దకార
సదృశమై త్రికారప్రాససంజ్ఞ గలిగి
యాత్రివిక్రముఁ డభయప్రదాత యనఁగ
వాక్త్రిపథగోజ్జ్వలులు విష్ణుభక్తులనఁగ. 45

గీ. ఈత్రి కారంబునకుఁ దీయ యెసఁగఁ గ్రింది
రేఫ సంప్రసారణమున ఋత్వ మయి తృ
తీయయగు నీత్రికార మర్దించి చూడ
నాతకారంబునకుఁ బ్రాసమయ్యె నచట. 46

గీ. ఇ ఉ ఋ ఌ ల కచ్చు పరమగునేని
య వ ర లాదేశ మగునట్టి య వ ర ల లకు
నడరి ఇ ఉ ఋ ఌ లాదేశ మయ్యెనేని
యది కృతుల సంప్రసారణ మండ్రు బుధులు. 47

ప్రాది ప్రాసము

గీ. ప్రాదియై యనశబ్దంబు ప్రాణ మగుటఁ
బరఁగ నణలకు వేర్వేఱ ప్రాసమయ్యె
క్షోణిధరుఁ డెత్తె నేనుఁగు ప్రాణ మనఁగ
దానవారాతి ప్రేతలప్రాణ మనఁగ. 48

సమ లఘు ప్రాసము

గీ. ఓలి రేఫతోఁగూడియు నూఁదఁబడక
తేలి తెలుఁగునఁ దమయట్టి వ్రాలతోన
సమలఘుప్రాస మగు ఔక్కలమరఁబట్టి
విద్రిచె నసురఁ గృష్ణుఁడు దిక్కు లద్రువ ననఁగ. 49

వికల్ప ప్రాసము

గీ. సానునాసికలౌ వర్గహల్లులకుఁ దృ
తీయములు వికల్ప ప్రాసమై యెలర్చు
ప్రాఙ్నగంబుపై రవిదోచెఁ నగ్ని వోలెఁ
బ్రాఙ్ముఖుండై నుతించె నీవాగ్మి యనఁగ. 50

బిందు ప్రాసము

గీ. వేర్చి పొల్లు నకారంబు బిందు వగుచు
మీఁదనున్న ధకారంబు నూఁదఁ బ్రాస
బంధమగుఁ గృష్ణుఁ డుదయించినం ధరిత్రి
యంతయును నిరుపద్రవం బయ్యె ననఁగ. 51

అర్ధబిందు ప్రాసము

గీ. సార్ధబిందువు లై తేలినట్టి పటల
కరయఁ బ్రాసంబు నిర్బిందు వైనఁ జెల్లు
వీఁపు మూఁపులు మఱి తలమోపు లయ్యె
మాట లేఁటికి మేటి తాఁబేఁటి కనఁగ. 52

ఉభయ ప్రాసము

క. చూడఁగ లకారరేఫలు
గూడుడకారంబు చను నకుంఠిత గతిఁదో
డ్తోడన నుభయప్రాసము
జాడఁబడును సంయుత ప్రసంగతిఁ గృష్ణా! 53

ఆ. పాఁడి మరగి బ్రతుకువాం డ్రిల వ్రేఁతలు
వాండ్ర వెన్న లేలఁ దండ్రి! యనఁటి
పండు కొఱకు వింత యిండ్లకు బోకు కృ
ష్ణుండ నీకు బ్రాతె పండ్లు నిచట. 54

గీ. రలయుతాయుత ప్రాస మార్గము దలంచి
వాండ్ల లేఁ జూపు మోముఁల దీండ్లమారె
ననుచు రెండును గూర్చిన ననువుఁదప్పు
నండ్రు నిఖిలార్థవిదు లైన దండికవులు. 55

సంయుత ప్రాసము

ఆ. పాడు నూరు ప్రోలు బహువచనంబులై
పరఁగుచుండు నూఁది పలుకు నపుడు
తేల్చి పలుకునపుడు దీపించు సంయుత
ప్రాస మిరుదెఱఁగుల బద్మనాభ! 56

ఆ. పాళ్ళు మనుజు లెక్క నూళ్ళు గాఁదొడఁగె న
య్యూళ్ళు మిగుల బలసెఁ బ్రోళ్ళు గాఁగ
భాగ్యవంతుఁ డేలుపాళులు నూళులు
ప్రోళు లయ్యె బ్రాతె కూళులిచట. 57

ఆ. తెలుఁగునందు లేదు లలిఁ గ్రిందిసుడి గ్రుచ్చె
గ్రుమ్మెనాఁగ రేఫకొమ్ము గాని
ప్రాసమైత్రి చొరదు దా సంయుత ప్రాస
మగును రేఫయుతము ననుసరించి. 58

క. ఈ క్రిందటి రేఫలుసమమై క్రాలు
చుఁదేలి ప్రాసమగు సంయుక్తం
బా క్రూర నక్ర భయమున, వాక్రువ్వ
దె గజము భక్తవత్సలుననఁగన్. 59

సంధిగత ప్రాసము

క. ధ్రువముగ సంధిజనితరూ
పవిశేషప్రాస మనఁగ బరఁగు పకారం
బవిరళవకార మగు న
య్యా వదాఱవపా లెఱుంగ ననఁగ ముకుందా! 60

వ. అది యెట్లనిన. 61

క. ప్రథమాంత విభక్తులపైఁ
గథితములగు కచటతపలు గసడదవలగున్
బృథివి నివి గజడదబలగుఁ
బ్రథమపు సున్న లగునాంత పదములమీఁదన్. 62

గీ. వాఁడు గనువాఁడు నేకొనువాఁడు డెక్కు
లాఁడు వాఁడు దపోనిధి వాఁడు వెద్ద
చిక్కెఁ గరి మ్రొక్కెఁజెలి వాక్కుఁడక్కు వెట్టె
శౌరిఁ దలఁచేనిన్ బిలిచె నాసంధు లిట్లు. 63

ఆ. ఆయచేత సద్వితీయ దా నిజరూప
మయ్యు నుండుఁ బ్రథమయట్టు లుండుఁ
గ్రతువు గాచె దాశరథి కృష్ణుఁ డొకపర్వ
తమును గొడుగు భంగిఁ దాల్చెననఁగ 64

గీ. అచ్చుమీఁదచ్చున యకార మాయజుండు
కొమ్ము గలహల్లు ప్రథమైనఁ గ్రుంకు నచ్చు
గురుఁడుపేంద్రుండు పెఱచోటఁ గ్రుంకు నొండెఁ
జను నకారంబు జనులందు జనులయందు. 65

గీ. ఓలిఁ గర్మధారయ షష్ఠు లుత్వములుగ
నచ్చు తుద నుండ టనుములౌ నాంధ్ర సంధిఁ
గఱకుటగచరు ల్గట్టి రక్కజపుటుదధి
వితతయశుఁ డైన రాజునానతి ననంగ. 66

గీ. నుఱులురులు పొల్లు లౌను దెనుంగు నందు
హేమ మిది పదాఱ్వన్నె నల్మోము లతఁడు
ప్రబలి హరిఁ గొల్చియున్న వా ర్వరమ మునులు
గోటిలో నొప్పు సతికిఁ గన్గొన లనంగ. 67

గీ. ద్విత్వమున కాదివర్ణములు తెనుఁగునందు
నూఁదకుండును వలసిన నూఁదియుండు

జానకీ వల్లభుఁడు క్షమాశాలి యనఁగ
దశరథాత్మజుఁడు స్వామి ధాత్రి కనఁగ. 68

వ. మఱియు శబ్దాలంకారవిశేషంబులు ప్రాసంబులు నెట్టి వనిన. 69

## షడ్విధ ప్రాసములు

క. అమరఁ గడుదుష్కరము ద్వం
ద్వము త్రి చతుష్ప్రాసములును దగ నంత్యప్రా
సమును ననుప్రాసము ననఁ
గ్రమమున షడ్విధము లయ్యెఁ గంసవిదారీ! 70

దుష్కరప్రాసము

క. దోఃకీలితమణి కటక యు
రః కలిత రమాభి రామ రంజిత సుజనాం
తః కరణ ఖండితారాశి
రః కందుక యనఁగ దుష్కరప్రాసమగును. 71

ద్వంద్వప్రాసము

క. కంజనయన భవభీతివి
భంజన శుకశౌనకాది బహుమునిచేతో
రంజన ద్వంద్వప్రాస మ
నంజను నిప్యాటఁ బల్కిన గృతు లందున్. 72

త్రిప్రాసము

క. తానవనీత ప్రియుఁ డన
దానవనిర్మూల నైకతత్పరుఁ డన స
న్మౌనివినుతుఁ డన నతసుర
ధేనువనం గృతులయందు ద్రిప్రాసమగున్. 73

చతుష్ప్రాసము

క. వారణవరద నిశాటవి
దారణ వీరావతార ధరణీవలయో
ద్ధారణ విరచిత సత్యవ
ధూరణవిజయ యనఁ దగి చతుష్ప్రాసమగున్. 74

అంత్యప్రాసము

క. అగణితవిభవస్ఫూర్తీ
నిగమాగమసతతవినుత నిర్మల మూర్తీ
జగదభిరక్షణవర్తీ
యగు నంత్యప్రాస మి ట్లుదంచితకీర్తీ! 75

క. మొదలిటిప్రాసమె కానీ
యిది యంత్యప్రాస మనఁగ నేదటకానీ

కదియింపవలయుఁ దానీ
పదనెఱిఁగిన బుధుఁడు కృతులఁ బరమజ్ఞానీ! 76

అనుప్రాసము

క. విప్రప్రకరమునిప్రీ
తిప్రద సుప్రభవ యప్రతిమదోఃప్రభవా
విప్రణుత సుప్రసన్నుయ
నుప్రాసప్రణవ మిది మనుప్రియచరితా! 77

# యతి ప్రకరణము

## యతి సంజ్ఞలు

క. విరతులు విశ్రాంతులు మఱి
విరామములు విశ్రమములు విశ్రామంబుల్
విరమంబులు యతు లనఁగా
విరమణములు నాఁగ వళ్ళు వెలయు మురారీ! 78

యతి పంచకము

క. స్వరయతులు వర్గయతులును
సరసయతు ల్ప్రకటమైన సంయుక్త యతుల్
పొరిఁ బ్రత్యేకయతులు ననఁ
బరఁగును యతి పంచకంబు పంకజనాభా! 79

యతిపంచక భేదములు

క. స్వరయతులు ప్రాది కాకు
స్వరనిత్యసమానయతులు వర్గయతులు ని
ద్ధరఁ బోలికవడి సంయుత
విరతి యనుస్వారయతులు వెలయు ముకుందా! 80

క. ప్రభునామాంతవిరతియన
విభాగవిరమణము భిన్నశ్రమమును గౌ
స్తుభధర! వికల్పయతి యన
నభేదవిరమణ మనంగ నైదు తెఱంగుల్. 81

## స్వరయతులు

ఆ. అగు నకారమునకు నైత్వౌత్వములు వడి
ఈకి ఋత్వమునకు నేత్వ మమరు
నుత్వమునకు నోత్వ మొనరు నీగతి స్వర
యతులు విస్తరిల్లు నబ్జనాభ! 82

క. స్వరములు దీర్ఘము హ్రస్వము
నరయఁగ నొక్కవిధ మెన్న యతులకు సంధ్య

క్షరము లగునచ్చులందు సు
చరితా! హ్రస్వములు లేవు సంస్కృతభాషన్. 83

క. అలఘుచతుస్సంధ్యక్షర
ములలో నై యౌలు దక్క మొదలిటిరెంటన్
దెలుఁగునను హ్రస్వదీర్ఘము
లొలయును నెఏలనంగ నొఓ లనఁగన్. 84

క. క్రియ నై యౌలకు హ్రస్వ
ద్వయము లమరు నాంధ్రభాషితప్రకరలో
నయిదనఁ దగు నైదనుచో
జయకీర్తీ! యవు ననంగఁ జను నౌ ననుచోన్. 85

గూఢస్వరయతి

గీ. స్వరముతుద నుండి లుప్తవిసర్గకోత్వ
మైనస్వరవిరామంబు దాసోఽహ మనగ
నచ్యుతాశ్రితు లుర్వి నన్యోన్యమిత్రు
లనఁగ నమ్ముకుందుండు యశోఽర్థి యనఁగ. 86

ఋకారస్వరూపయతి

గీ. క్షిత ఋకారరూపస్వరయతులు పరఁగు
ఋగ్యజుస్సామవినుతుండు కృష్ణుఁ డనఁగ
వృష్ణికులజుండు కరుణాసమృద్ధుఁ డనఁగ
హేమపీతాంబరుఁడు దేవవృషభుఁ డనఁగ. 87

రీ విరమము

క. విలన ద్రికారమునువ
ట్రిల రీవిరమంబు శౌరి ఋషులకు శశ్వ
త్సులభుఁ డనఁగ నీయేలకుఁ
దలఁపఁగ రీతోడి విరతి తలకొన దెందున్. 88

గీ. తెల్లముగ ఋకారము యణాదేశశక్తిఁ
గలుగు రేఫయిత్వమునందుఁ గదిసి యతికి
నట్టిరీకి నీయేలతో నన్వయించు
నట్టిసత్త్వంబులే దది హల్లుగాన. 89

ఌకారవిరతి

గీ. మును ఋకార మీ యేలతో నొనరినట్లు
చేర దొకట యణాదేశకారణమున
ఘనలకారంబ యగును ఌకారవిరతి
క్లృప్తి లేదు శౌరిగుణావళికి ననంగ. 90

క. స్వరములు కాదుల నొందిన
నరుదుగ స్వరయతులు దగును బ్రాదులు గాకు

స్వరమును నిత్యసమాసా
క్షరసంధులు రెండు నగు భుజంగమ శయనా! 91

గీ. ప్రాదినిత్య సమాసశబ్దములు గాక
పెరపదంబుల పైనచ్చు బెరసినప్పు
డన్నియును స్వరయతులగు సాంబగురుఁడు
శ్రీశుఁ డమరాన్వయాబ్ధి పూర్ణేందుఁ డనఁగ. 92

ప్రాదియతి

క. ధర నుపసర్గలు ప్రాన్వప
దురపాభిప్రతిసువిన్న్యు దుపపర్యధిసమ్
నిరతిపరాజపులిరువది
వరాజవులు చొరవు తెలుగు బాసను నెందున్. 93

ప్రాంతనిరంతరాన్విత దురంతసమస్తపరాక్రమంబున
త్యంతమదాప్తిశోభన మపాయ ముపాయము వీక్షణంబు ప్ర
త్యంత మభీష్టమధ్యయము స్వాంతము నీత ముదంచితంబుప
ర్యంతమనంగ సంధిలుఁ దిరంబుగ రెంటను బ్రాదులచ్యుతా! 94

కాకు స్వరయతి

క. కాకుస్వరయతి యగు నితఁ
డే కదలక జలధిఁ బవ్వళించె ననఁగ బ్ర
శ్నా కలితదీర్ఘ మగు నితఁ
డే కవ్వడి రథముఁ గడపె నిమ్ముల ననఁగన్. 95

ఆ. వలదు కృష్ణ యెఱుఁగవా మున్ను నన్ను నీ
వా విరుద్ధభాష లాడ నేల
లోన నెట్టియలుకలో నాఁగఁ గాకుస్వ
రోక్తి రెంటఁ జెల్లు నొగి ధరిత్రి. 96

గీ. వరుసదీర్ఘాంతసంబుద్ధి వచనయతుల
కమరుఁ గాకుస్వరంబు పరమసహస్ర
నామశోభిత గోపకృష్ణాయనంగ
నమరవందిత గోపకృష్ణా యనంగ 97

నిత్యసమాసయతి

గీ. పదము విభజించి చెప్పఁ జొప్పడని యవియు
నన్యశబ్దంబుఁగొని విగ్రహంబుఁ జెప్పు
నవియు నిత్యసమాసమై యతిశయిల్లు
నట్టిసంధుల నచ్చు హల్లైన విరతి. 98

ఆ. నాస్తియనక మహి ననంతసంపదలు నా
రాయణుం డొసంగు రమ్యమగుర
సాయనంబు బుధుల కతఁ డన్న నిత్యస

మాసయతుల రెంట నంటియుండు. 99

వ. ఈ నిత్యసమాసయతి పేరఖండయతి. 100

గీ. అఱయనంగను బోవుట కర్థమైన
సంధి నిత్యసమాసోక్తి జరగు రెంట
నసురవీరుల నెల్ల నుక్కఱ వధించె
భానుకులుఁడు రావణుని నేపఱిచె ననఁగ. 101

వ. అట్లు మఱియును. 102

నిత్యయతి

ఆ. ఏని యనుపదంబుతో నాదిపద మంది
సంధి నిత్యయతుల జరగుచుండు
నెట్టి క్రూరకర్ముఁడేని సద్గతి నొందు
నిన్ను నాత్మఁ దలఁచె నేని కృష్ణ! 103

ఆ. కదియు వడులు స్వరము కైవడిఁ గాదులు
ఋత్వమునకు నెత్వమెనయు చోటఁ
గృష్ణుఁ డాజిఁ గంసు గెడపె నండ్రార్యులు
కూర్మరూప విమలకోమలాంగ! 104

వర్గయతి

క. తలకొని కచటతపంబులు
తలనొక్కొకవ్రాయి తొలఁగఁ దమతమ నాల్గున్
విలసిల్లు వర్గయతు లనఁ
గలికల్మషతిమిరతపన ఘననిభవర్ణా! 105

పోలికవడి

క. వెలసిన పు ఫు బు భు వర్ణం
బులు పోలికవడి ముకారముగ నిడఁ దగు ని
మ్ములు హరిచరణసరోరుహ
ములు నాహృత్సరసియందుఁ బొదలు ననంగన్. 106

సరసయతి

ఆ. ఙనలు చెల్లుఁ గమలనాభ యొండొంటికి
నయహ లమరియుండు హస్తివరద
శషస లొందు నండ్రు చఛజఝంబులతోడ
సరసయతు లనంగ జలధిశయన! 107

సంయుక్తయతులు

క. ఏ నిను వేఁడెద లక్ష్మీ
క్ష్మానాయక నీవు నన్నుఁ గైకొని యిష్టం
బైనవి యొసఁగుము శుభల

క్ష్మా! నీవాఁడ నన నొప్పు సంయుక్తయతుల్. 108

క. ఒక్కడుగున విశ్రాంతులు
పెక్కగుచో సంయుతములు పెనుపకమును జ
డ్డక్కరమునఁ దానెత్తిన
యక్కరమే యునపవలయు నన్నిటఁ గృష్ణా! 109

క. వడినెలవులలోఁ జేరువ
యెడ నొకసంయుతము నొలయెడ నొకటినిఁ దా
రిడిరేని కవులు తప్పుట
యొడఁబడదు పృథగ్యతిప్రయోగముల హరీ! 110

ద్విరదగతి రగడ. క్ష్మావలయ మంతయు విషాణమున నెత్తుకిటి
మహిమ దలపోయ నక్కజ మనుచు నిట్లనక
క్ష్మావలయ మంతయు విషాణమున నెత్తుకిటి
సత్త్వ మరు దన నొప్పు సంయుక్తయతి చెడక. 111

రగడ. అంపమున వ్రచ్చుగతి వ్రచ్చె నఖముల రిపుని
వక్షము నృసింహుఁ డని రాయువడి సొరదు కృతి
అంపమున వ్రచ్చుగతి వ్రచ్చె నఖముల రిపును
రంబు నరసింహుఁ డనఁ గ్రాలు సంయుక్తయతి. 112

తద్భవవ్యాజయతి

గీ. అప్రసిద్ధముల్ జఞలు శబ్దాదియందు
ఞాజసంయుక్తి తద్భవవ్యాజమునను
నణలతోఁ బొందు విరతి యాజ్ఞప్తి యనఁగ
జలరుహోదరాశ్రితులు సుజ్ఞాను లనఁగ. 113

ఆ. యజ్ఞమునకు జన్న మాజ్ఞప్తి కానతి
యాజ్ఞ కాన సంజ్ఞ కరయ సన్న
విన్నపంబు వెండి విజ్ఞాపనమునకు
జ్ఞాకుఁ దద్భవంబు నా ధరిత్రి. 114

రేఫయతి

గీ. ఆంధ్రలిపిఁ జొప్పడదు ఋకారాన్వితంబు
క్రొత్తగాదు కృష్ణుని వెన్న మ్రుచ్చి మనఁగ
స్రుక్కఁ డతఁ డాజి నెట్టి విరోధి నైనఁ
గ్రుమ్ము నన రేఫయుతయతి గూడుఁ గాన. 115

అనుస్వారయతి

గీ. భువి ననుస్వారయతి బిందుపూర్వకముగ
ణాకు నిట నాల్గు చెల్లుఁ బాండవసహాయ!
నాకు నిట నాల్గు చెల్లుఁ గందర్పజనక!
మాకు నిటనాల్గు చెల్లు సంపదలరాజ! 116

మకారయతి

గీ. యరలవలు శషసహలు నాదిబిందు
యుతములై మకారవిరామయుక్తిఁ దనరు
మారుతాత్మజుఁ డరిదిసంయమి యనంగ
మదనజనకుఁడు దనుజసంహరుఁ డనంగ. 117

ఎక్కటియతి

క. ధర నెక్కటివళ్లైతగు
ళరమఋవలు వానిలోఁ (జెలంగును) లాకున్
సరి ళా యన విశ్రమవే
ళ రమాధిప రెండునుం గలసి వర్తించున్. 118

ఆ. మరునితండ్రి లోకమహితుండు యాదవ
రాజసింహ మూర్తి రక్షకుండు
ఋాఁగ వేలుపనఁగ ఋంపిల్లు నెక్కటి
వళ్ళు నాఁగ నిట్లు వనజనాభ! 119

## ప్రత్యేకయతులు

ప్రభునామాంతయతి

గీ. ఒరుల నన్నమ్మ యనుచోట నూఁదఁబడక
ద్వివిధ మగుఁ బ్రభునామాంతరవిరమణంబు
మహి నయోధ్యకు రాజు రామన యనంగ
నతనిపట్టపుదేవి సీతమ యనంగ. 120

విభాగయతి

గీ. సంఖ్యకుం బరిమాణసంజ్ఞకుఁ దనర్చు
శబ్దములపై విభాగోక్తి సరణి సంఘ
టించినప్పుడు యతులు రెండేసియగు ను
పేంద్రుఁ డిచ్చునర్థము మోపెఁడేసి యనఁగ. 121

భిన్నయతి

క. అంచితతిలకము శౌరి ధ
రించె ననఁగ జగణమధ్య రేఫవిరతి యౌ
నంచితతిలకము హరి ధరి
యించె ననఁగ భిన్న విరతి నిత్యమువచ్చెన్. 122

గీ. అట ఇకారాంతపదముమీఁదటి దికార
మది యనంగ నవ్వల భిన్న యతికిఁ జెల్లు
దివిజవిభవంబు శౌరిచేతిది యనంగ
నసురనాశంబు హరిచేతియది యనంగ. 123

వికల్పయతి

గీ. హయుతమై పొల్లుల వికల్పయతులు చెల్లు
దేవకీనందనుఁడు జగద్ధితుఁ డనంగ
హలధరుఁడు సంగరాంగణోద్ధతుఁ డనంగ
నవని మోచినయవి కకుబ్భస్త్రులనఁగ. 124

యుక్తవికల్పయతి

గీ. నలిఁ గకారహ ల్లితరానునాసికాఖ్యఁ
గదిసి తత్పంచమముగా వికల్పవిరతిఁ
గలుగుఁ జక్రి వల్లవసుదృఙ్మధుఁ డనంగఁ
గమలనేత్రుండు సకలదిఙ్మహితుఁ డనఁగ. 125

అభేదయతి

క. ప్రకట పకార వకార
ద్వికమునకుం జను నభేదవిరతి నిశాట
ప్రకర మెరిసె రామునిపా
వకశరమున జనకసుత నెపంబున ననఁగన్. 126

గీ. చెల్లుబడివళ్ళు ప్రాసము ల్చెప్పఁబడియె
నిందుఁ బూర్వప్రయోగంబు లెఱిఁగి యెవ్వి
బహుళమై తోఁచెనవి యొనర్పంగవలయు
నవ్యకావ్యప్రియోక్తుల నలిననాభ! 127

క. వరగణవర్ణము దీర్ఘ
స్వరమగుచో గణయుగంబు చను యతుల సుధా
కరకరగుణగతి శరరుచి
గిరిగజరుద్రాదిసంజ్ఞ కేశవనాథా! 128

క. ఎన్నిట యతి రావలె నని
రన్నిట సంస్కృతమునందు నగు విచ్ఛేదం
బెన్నిట యతిరావలె నని
రన్నిటఁ దెలుఁగునకు మొదలియక్షర మమరున్. 129

గద్యము. ఇది శ్రీవాణీప్రసాద లబ్ధవాగ్విభవ తిక్కనామాత్య తనూభవ
సుకవిజనవిధేయ అనంతనామధేయ ప్రణీతంబైన ఛందోదర్పణమునందు
గద్యపద్యాది కావ్యలక్షణంబును గురులఘునిర్ణయంబును గణనిరూపణంబును
బ్రాసయతి విశేషంబులును బరిగణనసంజ్ఞయు నన్నది ప్రథమాశ్వాసము.

శ్రీ రామాయనమః.

# ఛందోదర్పణము

## ద్వితీయాశ్వాసము





రమణ భక్త లోకమ
నోరమణ జగత్త్రయాభినుత రంజిత గౌ
రీరమణ సంభరిత వా
ణీరమణ యనంతశయన నీరజనయనా. 1

### గద్యలక్షణము

క. కనుఁగొనఁ బాదరహితమై
పనుపడి హరిగద్దెవోలె బహుముఖరచనం
బున మెఱయు గద్య మది దాఁ
దెనుఁగుకృతుల వచన మనఁగ దీపించుఁ గడున్. 2

గద్యము. స్వస్తి సమస్త భువన రక్షాదక్ష శ్రీపుండరీకాక్ష భుజగ పతి సింహాస
నారూఢ సురనికర మకుట తట ఘటిత సురుచిర మణిగణ ప్రభా
విభాసిత పాద పీఠ! వేద నినదానుకారి గౌరవ లలిత నూపురాలంకృత
చరణ సరసిజ యుగళ నవ్య పదాంగుష్ఠ నఖ మయూఖ రేఖాయిత సుర
సరిత్ప్రవాహ పీతాంబరధర నూత్న మేఖలా కలిత కటిత ప్రదేశ
చతురాననజనక నాళీకశోభితనాభి సరోవర, యఖండ బ్రహ్మాండ
కలాప గోపన నిపుణోదర, క్షీర సాగర తనయా మనోజ్ఞ గేహీకృత
విపుల వక్షస్థల కనత్కనక కటక కేయూర ప్రముఖ భూషణ భూషిత
చతుర్భుజ, శంఖపంకజసుదర్శన గదాధర కిరీట కుండలాభిరామ

యనవరత ప్రసన్న వదన కౌండిన్యవరద శ్రీయనంత పద్మనాభ
నమస్తే నమస్తే నమః అని గద్యపఠనం బొనర్చు నుత్తములకు నుత్తమాయు
రారోగ్యంబు లొదవునని విశదవచనంబుల విద్వజ్జనంబు లభినుతింతురు. 3

## ఛందములు

క. సమవృత్తము లనియెడు ను
త్తమ రత్నంబులకు జన్మధామములై పెం
పమరు సముద్రమ్ముల చం
దము లై ఛందములు మహి సుదర్శనపాణీ! 4

సీ. ఉక్తయు నత్యుక్తయును మధ్యయును బ్రతి-ష్ఠయు సుప్రతిష్ఠయు సరళమైన
గాయత్రి యుష్ణిక్కు నాయనుష్టుప్పును - బృహతియుఁ బంక్తియు మహితమైన
త్రిష్టుప్పు నలజగతియు నతిజగతియు - శక్వరి మఱి యతిశక్వరియును
నష్టియు వెండి యత్యష్టియు ధృతియును - నతిధృతియును మఱి కృతియుఁ బ్రకృతి

ఆ. యాకృతియును వికృతి యటుసంకృతియు నభి
కృతియు నుత్కృతియనఁ గీర్త్యమగుచు
జరుగు నిరువదారు ఛందంబు లేకోత్త
రాధికాక్షరముగ నబ్జనాభ! 5

## ఛందోవృత్త సంఖ్య

సీ. కరములు వేదముల్ కరులు రాజులు రాగ - సంఖ్య విద్యలు నిభ చక్షురిందు
లంగాస్త్రబాహువు లక్షీందుశరములు - గతిలోచనాంబర కమలరిపులు
నాగవేదాంబరనయనముల్ ఋతునిధి - ఖాబ్ధులు కరవిరించాబ్జఫణులు
గతినాగగుణశాస్త్ర కైరవాప్తులు దిగ్గ - జాంగపర్వతలోచనానలములు
ఆ. శాస్త్రవహ్ని బాణశరతర్కములు బాహు
శైలఖేందురామచంద్ర సంఖ్య
గతిగతీందు బాహుఋతుబాహు లహినాగ
బాహువేద బాహుబాణచయము. 6

సీ. ఋతుశైల శరగజగతి ఖేందు లక్షిభూ - తేంద్వద్రినిధిగగ నేక్షణములు
నిగమాభ్రగుణగతి నిధిచంద్రగతులు వా - రణఋర్తుగజదంతిరామకరులు
తర్కేందుకరమునిత్రయతర్క విధు లక్షి - పావకాబ్ధిసముద్ర బాణబాణ
వహ్నివహ్నులు బ్రహ్మవదనాంగభుజగేభ - ఖేందుశైలర్తులు ఛందములను
ఆ. వేఱువేఱ పుట్టు వృత్తసమూహంబు
వెండి సర్వవృత్తవితతి యరయ
ఋతుకరాద్రి శైలసితదీప్తి నయనతో
యధికృశానుచంద్రు లబ్జనయన. 7

## సర్వసమవృత్తభేద సంఖ్య

చ. ఒగిఁబదమూఁడు కోటులును నొప్పుగనల్వది రెండులక్షలున్
దగఁ బదునేడు వేలు నుచితంబుగ నవ్వల నేడునూటిపై

నగణితవైభవా యిరువదాఱు గదా సమవృత్తభేదముల్
ప్రగుణితలక్షణస్ఫురణఁ బంచినఛందము లిర్వదాఱిటన్. 8

## సమవృత్త లక్షణము

క. హెచ్చును గుందును బొరయక
యచ్చొత్తినయట్లు నాలుగడుగులు సమమై
వచ్చును యతినియమంబును
జెచ్చెర సమవృత్తములకుఁ జిత్తజజనకా! 9

వ. సమవృత్తంబు లెట్టి వనిన. 10

ఉక్తాఛందము

శ్రీ. శ్రీ,, భా, విం, తున్. 11

అత్యుక్తాఛందము

స్త్రీ. స్త్రీరూ, పారున్, ఘోరా, ఘూరీ. 12

మధ్యాఛందము

వినయం. వినయం, బొనరిం, తు ననం, తునకున్. 13

ప్రతిష్ఠా ఛందము

బింబము. శ్రీకలితా, స్తోకభగల్, పైకొనుబిం, బాకృతికిన్. 14

సుకాంతి. అగున్ సుకాం, తి గూర్పఁగా, జగంబులన్, జగత్పతీ. 15

సుప్రతిష్ఠా ఛందము

అంబుజ. పంబిభలగా, డంబరముగా, నంబుజము చె, ల్వం బగుహరీ. 16

పంక్తి. ఒక్కభకారం, బెక్కు గగంబుల్, నెక్కొనుఁ బంక్తిం, దక్కక శౌరీ. 17

గాయత్రీఛందము

తనుమధ్య. గోపాలుని దేవే
నాపాలికి నాఁగాఁ
బై పై తనుమధ్యన్
బ్రాపించుఁ దయంబుల్. 18

ఉష్ణిక్ఛందము

మధుమతి. మధురిపుఁ డనినన్
మధురపుననగల్
మధురము లగుచున్
మధుమతి నమరున్. 19

మదరేఖ. రూపింప న్మగణాద్యం

బై పెంపార సగంబుల్
దీపించు న్మదరేఖన్
గోపస్త్రీ హృదయేశా! 20

అనుష్టుప్ఛందము

విద్యున్మాల. మాద్యద్భక్తిన్మాగాయుక్తిన్
విద్యున్మాలా వృత్తం బొప్పున్
చైద్యధ్వంసిన్ సంబోధింపన్
సద్యశ్శ్రీయోజాతంబయ్యెన్. 21

చిత్రపదము. వారక భాగురుయుగ్మం
బారఁగఁ జిత్రపదాఖ్యం
జేరిన వేడ్కఁ గవీంద్రుల్
గోరి నుతింతురు శౌరిన్. 22

ప్రమాణి. సరోజనాభుఁ డచ్యుతుం
డరాతి భంజనుం డనన్
జరేఫలన్ గలంబులన్
ధరం బ్రమాణి యొప్పగున్. 23

బృహతీఛందము

హలముఖి. చిత్తజాతునిగురునికై
యెత్తుఁ డంజలు లనినచో
సత్తుగా రనసములొగిన్
బొత్తుగా హలముఖి యగున్. 24

క. వదలక పంక్తిచ్ఛందము
మొదలుగ నిటమీఁది ఛందముల కందముగా
నుదయించు వృత్త సమితికి
విదితంబుగ వళులు వలయు విధురవినయనా! 25

పంక్తిఛందము

రుగ్మవతి. రూపితరీతిన్ రుగ్మవతీసం
రూపభమంబుల్ రూఢి సగంబుల్
ప్రాపుగ భూత వ్రాతయుతుల్గా
శ్రీపతిలీలన్ జెప్పఁగ నొప్పున్. 26

మత్త. మొత్తం బారు న్మభములు నిత్యో
దాత్తంబై సస్ఫురితగకారా
యత్తం బై షణ్మితయతి నొందున్
మత్తావృత్తంబగు మహిఁ గృష్ణా! 27

ప్రణవము. ఆరంగా మనయగసంయుక్తిన్
సారోదంచితశర విశ్రాంతిన్

శ్రీరాజుం బొరసిన నత్యంత
స్ఫారంబై చను ప్రణవం బుర్విన్. 28

మయూరసారి. చూతమా యశోదసూను నంచున్
వ్రేత పల్కుఁదర్క విశ్రమంబుల్
భాతిగా రజంబుపై రగంబుల్
జాతిగా మయూరసారిఁ జెప్పున్. 29

శుద్ధవిరాటి. శ్రీమంతుండగు చిన్న కృష్ణునిన్
ధీమంతు ల్ప్రణుతింప బాణవి
శ్రామంబున్ మసజంబు గంబునై
రామా శుద్ధవిరాటి యొప్పగున్. 30

మణిరంగము. శ్రీమనస్సరసీరుహమిత్రున్
బ్రేమ మొప్పఁగ బేర్కొనుచోటన్
రామనస్త్రవిరామరసాగల్
కోమలంబు లగు న్మణిరంగన్. 31

త్రిష్టుప్ఛందము

తోదకము. తోరపువేడుకఁ దోదక వృత్తా
కారముగాఁ ద్రిభకారగగంబుల్
నీరజనాభుని నెమ్మినుతింపన్
జారువిరామము షణ్మితి నొందున్. 32

ఇంద్రవజ్ర. సామర్థ్యలీలన్ తతజద్విగంబుల్
భూమిధ్ర విశ్రాంతులఁ బొంది యొప్పున్
ప్రేమంబుతో నైందవబింబవక్త్రున్
హేమాంబరుం బాడుదు రింద్రవజ్రన్. 33

ఉపేంద్రవజ్ర. పురారిముఖ్యామరు పూజనీయున్
సరోజనాభున్ జతజద్విగోక్తిన్
దిరంబుగా నద్రియతి న్నుతింపన్
ఇరాసుతాధీశు నుపేంద్రవజ్రన్. 34

ఉపజాతి. పినాకికోదండము బిట్టుద్రుంచెన్
దానొప్పగెల్చెన్ జమదగ్ని సూనున్
అనంతసత్త్వుం డితఁ డంచు మెచ్చున్
జానైన వృత్తం బుపజాతి యయ్యెన్. 35

క. సమపదము లింద్రవజ్రవి
షమపదము లుపేంద్రవజ్రఁ జను నుపజాతిన్
సమవిషమాంఘ్రులు తద్వ్య
త్క్రమమైనను నదియ పేరు కమలదళాక్షా! 36

రథోద్ధతము. నందగోపవరనందనున్ రమా

నందుఁ బ్రస్తుతి యొనర్చి షడ్యతిన్
అందమై రనరవాహ్వయంబు లిం
పొందఁ జెప్పిన రథోద్ధతం బగున్. 37

గీతాలంబనము. నాళీకభవామరనాథు లొగిన్
శ్రీలోలుని గీర్తన సేయ నొగిన్
బోలంగఁ దజావలఁ బొందిన గీ
తాలంబన మై చను నద్రియతిన్. 38

స్వాగతము. నారదాదిమునినాయక వంద్యున్
శౌరిఁ జేరుఁ డన స్వాగత మొప్పున్
సారమైనయతి షణ్మితి నొందన్
భూరిరేఫనభముల్ గగయుక్తిన్. 39

శాలిని. చేతో రాగం బుల్లసిల్లన్మతాగా
ద్యోతంబై షడ్వర్ణయుక్తిన్ విరామం
బేతేరంగా నిందిరేశప్రభావా
న్వీతంబైనన్ శాలినీ వృత్తమయ్యెన్. 40

శ్యేని. ఆరమాధినాథుఁ డక్షయంబుగాఁ
జీర లిచ్చె యాజ్ఞసేని కంచుఁ బెం
పారఁ జెప్ప శ్యేని యయ్యె షడ్యతిన్
స్ఫారమై రజంబుపై వరంబుగాన్. 41

వాతోర్మి. దేవాధీశున్ హరిఁ దేజో వనధిన్
భావింపంగా ఋతుభాస్వద్విరతిన్
ఈవాతోర్మిన్ మభలేపారుఁ దకా
రావాసంబై లగ మర్దిన్ గదియన్. 42

చంద్రిక. నగణయుగమునన్ రవంబులన్
బ్రగుణరసవిరామసంగతిన్
తగిలి హరికథాసమేతమై
నెగడు గృతుల నిండి చంద్రికన్. 43

జగతీఛందము

భుజంగ ప్రయాతము. భుజంగేశపర్యంక పూర్ణానురాగున్
భుజంగప్రభూతాఖ్యఁ బూరించుచోటన్
నిజంబై ప్రభూతావనీభృద్విరామం
బజస్రంబుగాఁ గూర్ప యాద్వంద్వ మొప్పున్. 44

తోటకము. జలజోదరనిర్మలసంస్తవముల్
విలసిల్లెడుఁ దోటకవృత్తమునన్
బొలుపై సచతుష్కముఁ బొండగ నిం
పలరారఁగఁ బల్కుదు రష్టయతిన్. 45

తోవకము. చెలఁగి నజాయలఁ జెందిన నారీ
తిలకము లద్రియతిన్ మృదురీతిన్
వెలయఁగఁ దోవక వృత్తి విభాతిన్
బలుకుదు రిమ్ములఁ బంకజనాభున్. 46

స్రగ్విణి. దేవకీనందనున్ దేవచూడామణిన్
భూవధూవల్లభుం బుండరీకోదరున్
భావనాతీతునిం బల్కఁగా స్రగ్విణీ
భావ మాద్యంతరేఫంబగున్ షడ్యతిన్. 47

ఇంద్రవంశము. సొంపార నీ దేవుని సూనుఁడై కదా
ఱంపిల్లెఁ బుష్పాస్త్రుఁడు ఱాఁగ యౌననన్
ఇంపార భూభృద్యతి నింద్రవంశమున్
బెంపారఁ దాజంబులఁ బేర్చు రేఫతోన్. 48

వంశస్థము. నమో నమో దేవ జనార్దనాయ తే
నమో నమః పంకజనాభ నావుడున్
రమించు వంశస్థ విరామమద్రులన్
సమంచితంబై జతజంబు రేఫయున్. 49

ద్రుతవిలంబితము. శ్రుతి మతాంగ నిరూఢమహాయతిన్
యతివర ప్రముఖార్యజనం బొగిన్
ద్రుతవిలంబిత తోషితరీతులన్
క్షితిధరున్ నుతిసేయు నభారలన్. 50

జలధరమాల. శ్రీతన్వీశుం దగిలితిఁ జిత్తం బారన్
మాతా యంచున్ జలధరమాలావృత్తం
బేతేరంగా మభనమ లింపొందంగాఁ
బ్రీతిం బల్క న్విరతి కరిన్ బ్రాపించున్. 51

ప్రియంవద. త్రిభువనాభినుతు దేవదేవునిన్
బ్రభుముకుందు నిటు ప్రస్తుతింపఁగా
నభజర ల్గదిసినం బ్రియంవదా
విభవ మొప్పు గిరి విశ్రమంబులన్. 52

ప్రమితాక్షరము. కమనీయతేజుని నగణ్యయశున్
గమలాధిపుం బలుకఁగా సజసల్
క్రమమొప్పఁ గూడఁగ సకారముతోఁ
బ్రమితాక్షరం బహివిరామమగున్. 53

జలోద్ధతగతి. సరోరుహదళాక్ష శాశ్వతయశా
పురారినుత యంచు భూదరయతిన్
సరాగ మగుచున్ జసల్ జసలతో
నురుప్రభ యగున్ జలోద్ధతగతిన్. 54

విశ్వదేవి. జానొందం గావ్యశ్రీకి సంప్రీతితోడన్

మానాథు న్నాథుం జేసి మాయాగణంబుల్
ధీనిత్యుల్ ధాత్రీభృద్యతిం గూర్తు రింపుల్
తేనెల్ సోనల్ గా విశ్వదేవీసమాఖ్యన్. 55

అతిజగతీఛందము

మత్తమయూరము. భోజాధీశుం డంచుఁ బ్రభూతాత్మకుఁ డంచున్
భ్రాజిష్ణుం డంచున్ యతి బాగౌ గిరి సంజ్ఞన్
ఓజస్స్ఫీతంబై మతయో పేతసగంబుల్
ఓజం బల్కు న్మత్తమయూరం బలరారున్. 56

జలదము. మ్రొక్కుల కెల్ల నెల్ల యగుమూర్తి గదా
యక్కమలాక్షుఁ డంచుఁ జతురాస్యయతిన్
దక్కక ప్రస్తుతింప జలదం బగు ని
ట్లొక్కటియై భరేఫనభ లొందు గురున్. 57

మంజుభాషిణి. దివిజేంద్రుఁ డాదియగు దేవసంఘముల్
భువి మంజుభాషిణికి భోగిరాడ్యతిన్
సవరింపఁగా సజసజంబు గాంతమై
భువనోదరస్తుతి యపూర్వ మై చనున్. 58

ప్రహర్షిణి. ముక్తిశ్రీకరు భవమోచను న్మురారిన్
భక్తిం బ్రోడజనులు ప్రస్తుతింప నొప్పున్
వ్యక్త గ్రావయతిఁ బ్రహర్షిణి సమాఖ్యన్
యుక్తంబై మనజరగోజ్జ్వలద్గణాప్తిన్. 59

ప్రభాతము. సరసిజనాభ భుజంగ రాజతల్పా
శరణము నీవని సన్మతిం దలంపన్
బెరయు నజారలు పేర్మి నొప్పగున్ గన్
జరగుఁ బ్రభాతము శైల విశ్రమంబున్. 60

రుచిరము. అనంగకోటివిలసదంగవైభవున్
మనంబులో నిలిపిన మాను నాపదల్
అనన్ జభంబులు సజగానుసంగతిన్
దనర్చు నీరుచిరకు దంతి రాడ్యతిన్. 61

శక్వరీఛందము

వనమయూరము. ఉన్నతములై వనమయూర కృతు లోలిన్
ఎన్నఁగ భజంబులపయి న్సనగగంబుల్
చెన్నొదవ దంతియతిఁ జెంది యలరారన్
వెన్నుని నుతింతురు వివేకు లతిభక్తిని. 62

వసంత తిలకము. గౌరీనితాంతజప కారణనామధేయున్
దూరీకృతప్రణతదుష్కృతు నంబుజాక్షున్
ధీరోత్తము ల్గిరియతిన్ తభజాగగ ల్పెం
పార న్వసంతతిలకాఖ్య మొనర్తు రొప్పున్. 63

ప్రహరణ కలిత. వనరుహసఖుఁడున్ వనరుహారిపుఁడున్
గనుఁగవ యగు నాకరి వరదునకున్
ననభనలగము న్నగయతిఁ బలుకన్
బనుపడుఁ గృతులం బ్రహరణకలితన్. 64

సుందరము. కోరిన కోరిక లిచ్చుఁ గోమలి చూడవే
మారునితండ్రి యనం గ్రమంబున నీక్రియన్
భారసవంబుల నొప్పుఁ బన్నగరాడ్యతిన్
సూరిజనంబులు సెప్ప సుందరవృత్తముల్. 65

అపరాజితము. మునిజనవినుతుం డమోఘుజయోన్నతుం
డనితరసదృశుం డనంగ గురుం డనం
జను ననయుతమై రసంబు లగంబులై
తనరఁగ నపరాజితం బహిరాడ్యతిన్. 66

అసంబాధ. సౌమ్యుంబై విష్ణుస్తుతులను నతి సేవ్యంబై
రమ్యస్ఫూర్తిన్ రుద్రవిరమణము రమ్యంబై
గమ్యాకారం బొప్పు మతనసగగ ప్రాప్తిన్
సమ్యగ్భావంబై పొలుపమరు నసంబాధన్. 67

భూనుతము. శ్రీనివాస పురుషోత్తమ సింధువిహారా
పూని మమ్ముఁ గృప జేకొని ప్రోవు మనంగా
భూనుతంబు రనభాగలఁ బొందిగయుక్తిన్
పూని సొంపుగ గ్రహాక్షరమున్ వడినొందన్. 68

కమల విలసితము. నగణము నగణము నగణముఁ జేరన్
నగణము గగము నొసర నటమీఁదన్
దిగిభ విరమణము దిరమగునేనిన్
దగుఁ గమలవిలసితము కమలాక్షా! 69

అతిశక్వరీఛందము

మణిగణనికరము. కనకపు వలువలుఁ గరకటకములున్
నునుపగు తుఋమును నొసలితిలకమున్
దనరెడు హరిఁ గని తగననననసల్
నినిచిన మణిగణనికర మిభయతిన్. 70

మాలిని. సకల నిగమవేద్యున్ సంసృతి వ్యాధివైద్యున్
మకుటవిమలమూర్తిన్ మాలినీవృత్త పూర్తిన్
సకలితసమయోక్తి న్నాగవిశ్రాంతియుక్తిన్
సుకవులు వివరింపన్ సొంపగున్విస్తరింపన్. 71

సుకేసరము. యతియవతారసంఖ్య నిడి యాదరంబుతో
నతిశయమై నజంబులు భజాంతరేఫలున్
వితతముగా నొనర్చి యరవిందలోచనున్
క్షితిధరు సంస్తుతించిన సుకేసరంబగున్. 72

మణిభూషణము. హస్తిరాజభయనిర్హర యండజవాహనా
ధ్వస్తసంసరణ యంచుఁ బితామహవిశ్రమ
ప్రస్తుతంబుగ రనంబుల భారగణంబులన్
విస్తరింప మణిభూషణ వృత్తము చెల్వగున్. 73

మనోజ్ఞ. అజశివశక్రనిరంతరార్చితపద్ద్వయున్
భుజగకులాధిపతల్పుఁ బూని నుతింపఁగా
నజయతి నొండి నజాభరార్చిత మైచనున్
ఋజు వగు నుర్వి మనోజ్ఞ ఋష్యనురాగమై. 74

అష్టిచ్ఛందము

ప్రియకాంత. అవనియు శ్రీయు న్సతు లజుఁడాత్మోద్భవుఁ డాప్తుల్
దివిజులు దామోదరునకు దేవ ళ్ళీఁ కనేరి
సవతు గ నాఁగా నయనయనమ్యక్సగయుక్తిన్
గవినుతమై దిగ్యతిఁ బ్రియకాంతాకృతి యొప్పున్. 75

పంచచామరము. జరేఫలున్ జరేఫలున్ జసంయుతంబులై తగన్
గురూపరిస్థితిం బొసంగి గుంఫనం బెలర్పఁగా
విరించిసంఖ్య నందమైన విశ్రమంబులం దగున్
బ్రరూఢమైనఁ బద్మనాభ పంచచామరం బగున్. 76

పద్మకము. నకలితంబు నభజాజగణంబులు గాంతమై
సకలదిగ్విరమణంబులు సన్నుతమై చనన్
శకట దైత్య మదభంజను సన్నుతిసేయఁగాఁ
బ్రకటమైకృతులఁ బద్మము పద్మకుఁ బట్టగున్. 77

ఫలసదనము. ననలును ననలును దనరఁగ సగయుక్తిన్
వనరుహ భవయతు లవహిత మతితోడన్
నినుపుచు సుకవులు మణివిలసదురస్కున్
గొనకొని పొగడఁగ నగు ఫలసదనంబుల్. 78

చంద్రశ్రీ. జగన్నాథున్ లక్ష్మీహృదయ జలజప్రోద్యదర్కున్
ఖగాధీశారూఢున్ సుకవిజనకల్ప ద్రుమంబున్
దగ న్వర్ణింపంగా యమనసయుతంబై రగంబుల్
మొగిం జంద్రశ్రీకి న్నిలుచు యతి ముక్కంటినొందున్. 79

మేదిని. నగణముతో జకారభగణంబుల్ జకార
ప్రగుణిత రేఫయున్ గురువుభాతిఁగాగ నోలిన్
దగ నవతార విశ్రమము దండిగా నొనర్పన్
మృగమదవర్ణుఁ డీయకొను మేదినీ సమాఖ్యన్. 80

అత్యష్టిచ్ఛందము

నర్కుటము. కొలిచెద నందగోపసుతు కోమలపాదములన్
దులిచెదఁ బూర్వ సంచితపు దోషములన్ సుఖినై
నిలిచెద నన్న నర్కుటము నిర్మల వృత్తమగున్

సలలితమై నజంబుల భజావల దిగ్విరతిన్. 81

శిఖరిణి. గజేంద్రాపధ్వంసిన్ ముదిరసదృశుం గంజనయనున్
భజింతుం దాత్పర్యంబున ననినచో భాస్కరయతిన్
ప్రజాహ్లాదం బైనన్ యమనసభవ ప్రస్ఫురితమై
ద్విజశ్రేష్ఠు ల్మెచ్చన్ శిఖరిణి గడున్ విశ్రుతమగున్. 82

మందాక్రాంత. చెందెం బాదాంబుజరజముచే స్త్రీత్వ మారాతికిం జే
యందెం జాపం బిరుతునుకలై యద్భుతం బావహిల్లన్
మ్రందె న్మారొడ్డి దశముఖుఁడున్ రాముచే నంచుఁ జెప్పన్
మందాక్రాంతన్ మభనతతగా మండితాశా యతుల్గాన్. 83

పాలాశదళము. పదునయిదు లఘువులును బరఁగ గగ మొందన్
బదియగునెడ విరతులు బలసి పొడసూపన్
బొదలి హరినుతులఁగడు దొలుపగుచుఁ బాలా
శదళ మనఁబరఁగుఁ గవిజనులు గొనియాడన్. 84

పృథ్వి. జసంబులు జసంబులున్ యలగ సంగతిన్ సాంగమై
పొసంగ నమృతాంశుభృద్యతులు పొందఁ బాదంబులై
బిసప్రసవలోచనా! వినుము పృథ్వినాఁ బృథ్విలో
నసంశయమగున్ భవద్వినుతులందు నింపొందినన్. 85

హరిణి. జరగు నసమప్రోద్యద్రేఫల్ ససంగతమై లగల్
దొరయఁగ మురద్వేషిన్ సద్భక్తితో వినుతించెదన్
సరసిరుహగర్భే శానాదిత్యసత్తము నన్నచో
హరిణి యనువృత్తం బొప్పారున్ బురారి విరామమై. 86

ధృతిచ్ఛందము

మత్తకోకిల. ఒక్కచేత సుదర్శనంబును నొక్క చేతను శంఖమున్
ఒక్కచేతఁ బయోరుహంబును నొక్క చేత గదం దగన్
జక్కడంబగుమూర్తికిన్ రసజాభరంబులు దిగ్యతిన్
మక్కువందగఁ బాడి రార్యులు మత్తకోకిల వృత్తమున్. 87

కుసుమితలతావేల్లిత. శ్రీనాథున్ బ్రహ్మాద్యమరవర సంసేవ్యపాదారవిందున్
దీనానాథ వ్రాత భరను గుణోదీర్ణునిం బాడి రోలిన్
గానారూఢాత్ముల్ మతనయయయల్ కామజిద్విశ్రమంబై
వీనుల్ నిండారం గుసుమితలతావేల్లితావృత్తమొప్పున్. 88

అతిధృతిచ్ఛందము

శార్దూలవిక్రీడితము. పద్మప్రోద్భవసన్నిభుల్ మసజస ప్రవ్యక్త తాగంబులన్
బద్మాప్తాంచితవిశ్రమంబుగ సముత్పాదింతు రుద్యన్మతిన్
బద్మాక్షాయ నిజాంఘ్రిసంశ్రిత మహాపద్మాయ యోగీంద్ర హృ
త్పద్మస్థాయ నమోస్తుతే యనుచు నీశార్దూలవిక్రీడితన్. 89

తరళము. జలరుహాహిత సోదరీ ముఖ చంద్ర చంద్రిక లాదటన్

గొలఁది మీఱఁగ లోచనంబులఁ గ్రోలి యొప్పు మహాసుఖిన్
బలుకుచో నభరంబులుం బిదపన్ సజంబు జగంబులున్
జెలువుగా దరళంబునోలి రచింతు రంధకజిద్యతిన్. 90

మేఘవిస్ఫూర్జితము. రమానాథున్ నాథున్ యదుకుల శిరోరమ్య రత్నాయమానున్
సముద్యత్తేజిష్ణున్ దనుజయువతిస్ఫారహారాపహారున్
మిమ్ముం బ్రీతిం బేర్కొం డ్రరుణ విరతిన్ మేఘ విస్ఫూర్జితాఖ్యన్
గ్రమంబొప్పన్ బెద్దల్ యమనసములున్ రాగముల్గా ముకుందా! 91

భూతిలకము. వాఁడె వధూమణి చూడవే ద్రిదివద్రుమంబు ధరిత్రికిన్
బోడిమి దెచ్చిన శూరుఁ డీతనిఁ బోలలే రిల నెవ్వరున్
వీఁ డధికుం డని భీమవిశ్రమవృత్తి భూతిలకం బగున్
వేఁడి నుతింతురు భారసంబుల వెంట జాగము లొందఁగాన్. 92

చంద్రకళ. వీనులారఁ బ్రసిద్ధపదంబుల్ వేడుకఁ గూర్చి దిశాయతిన్
గాన వచ్చి రపాతజజంబుల్ గల్గ దిటంబుగఁ జెప్పగన్
జానకీవదనాంబుజ శశ్వత్సౌరభలోల మధువ్రతా
దానవాంతక చంద్రకళా వృత్తంబు సభం గడు నొప్పగున్. 93

కృతిచ్ఛందము

మత్తేభవిక్రీడితము. భవరోగ ప్రవినాశనౌషధకలా ప్రావీణ్యగణ్యుండు శై
ల విభేది ప్రముఖాఖిలామరదరోల్లాసుండు గోవిందుఁ డం
చు వివేకు ల్సభరంబులు న్నమయవస్తోమంబు గూడన్ సమ
ర విధిం జెప్పుదురా త్రయోదశయతి న్మత్తేభవిక్రీడితన్. 94

అంబురుహము. తారతుషార పటీర మరాళ సుధాసమాన మహాయశా
నీరద భృంగ తమాల దళాసిత నీరజేంద్ర మణిద్యుతీ
హార కిరీట ముఖాభరణాంచిత యంచు శ్రీపతిగూర్చి భా
భారసవంబుల భాను విరామముఁ బల్క నంబురుహంబగున్. 95

ఉత్పలమాల. శ్రీరమణీముఖాంబురుహ సేవన షట్పద నాథ యంచు శృం
గార రమేశ యంచు ధృత కౌస్తుభ యంచు భరేఫనంబులన్
భారలగంబులుం గదియఁ బల్కుచు నుత్పలమాలికాకృతిన్
గారవమొప్పఁ జెప్పుదురు కావ్యవిదుల్ యతి తొమ్మిదింటఁగాన్. 96

ఖచరప్లుతము. వరద కేశవ దైత్యవిదారీ వారిజనాభ జగన్నిధీ
కరుణఁ జూడుము మమ్ముఁ బ్రసన్నాకార హరీయని పల్కినన్
వరుసతో సభభంబు మసావల్ వాలఁగ రుద్రవిరామ మై
యరుదుగా మునిపుంగవ వర్ణ్యంబై ఖచరప్లుత మొప్పగన్. 97

ప్రకృతిచ్ఛందము

చంపకమాల. త్రిభువనవంద్య గోపయువతీజనసంచితభాగధేయ రుక్
ప్రభవసముత్కరోజ్జ్వల శిరస్స్థిత రత్న మరీచి మంజరీ
విభవ సముజ్జ్వలత్పదరవింద ముకుంద యనంగ నొప్పునా
జభములు జాజరేఫములుఁ జంపకమాల కగున్ దిశాయతిన్. 98

స్రగ్ధర. తెల్లంబై శైలవిశ్రాంతిని మునియతినిం దేజరిల్లున్ దృఢంబై
చెల్లెం బెల్లె మకారాంచిత రభనయయల్ చెంద మీఁదన్ యకారం
బుల్లం బారన్ బుధారాధ్యు నురగశయనున్ యోగివంద్యుం గడున్ రం
జిల్లం జేయం గవీంద్రుల్ జితదనుజగురం జెప్పుదుర్ స్రగ్ధరాఖ్యన్. 99

వనమంజరి. హరి పురుషోత్తమ కృష్ణ కృపానిధి యాదిమూలమ యంచు నా
కరిపతి పల్కఁగఁగాచె నితం డని కౌతుకంబునఁ బల్మరున్
జరగుఁ ద్రయోదశవిశ్రమముల్ నజజాజభాంచితరేఫలన్
మరుగురునిం బ్రణుతింతు రిలన్ వనమంజరిం గవిపుంగవుల్. 100

మణిమాల. శరణాగతార్తిహర ణాంబుజాతదళ సన్నిభాంబక యుగా
కరుణాసముద్ర జగదాదికారుణ పురాణమూర్తి యనుచున్
వరుసన్ సజత్రితయమున్ ద్రివారమొనరున్ సకారము తుదిన్
దిరమొంద దిగ్యతిఁ గవుల్నుతింప మణిమాలవృత్తమరున్. 101

లాటీవిటము. సగణంబులునాల్గిటిపై మతయల్ సమ్యగ్భావంబై యరుదేరన్
బగలింటికి నేలిక యెవ్వఁడు నా భావింపంగా భాసురభంగిన్
మిగులన్మధురంబగు శబ్దములన్ విశ్రాంతిన్ లాటీవిటవృత్తం
బగునిందుకళాధరసన్నుత నామాంకాశంకాంతంకవిదారీ! 102

ఆకృతిచ్ఛందము

మానిని. కొన్నెలపువ్వును గోఱలపాఁగయుఁ గూర్చిన కెంజడ కొప్పునకున్
వన్నె యొనర్చిన వాహిని యాతని వామపదంబున వ్రాలె ననన్
జెన్నుగ నద్రిభసేవ్యగురు న్విలసిల్లు రసత్రయ చిత్రయతుల్
పన్నుగఁ నొందఁ బ్రభాసురవిశ్రమ భంగిగ మానిని భవ్యమగున్. 103

మహాస్రగ్ధర. కొలిచెం బ్రోత్సాహవృత్తిం గుతలగగనముల్ గూడ రెండంఘ్రులం దా
బలిఁ బాతాళంబు చేరం బనిచెఁ గడమకై బాపురే వామనుండ
స్ఖలితాటోపాఢ్యుఁ డంచుం గరిగిరివిరమాకార మారన్ నతానో
జ్జ్వలసోద్యద్రేఫయుగ్మాశ్రయగురుల మహాస్రగ్ధరం జెప్ప నొప్పున్. 104

భద్రకము. ఆది భఁజేసియవ్వలరనద్వయంబు నొగి మూఁడు తానకములన్
బాదుకొనంగ నొక్కగురువొందఁ బైవిరతి రుద్ర సంఖ్య నిడినన్
గాదనరాదు భద్రకమునాఁగ గాఢమగువృత్త మొప్పుఁ గృతుల
శ్రీదనరార నాశ్రిత వితాన చించిత ఫల ప్రదాన నృహరీ! 105

వికృతిచ్ఛందము

కవిరాజవిరాజితము. కమలదళంబులకైవడిఁ జెన్నగు కన్నులు జారుముఖప్రభలున్
సమధికవృత్తకుచంబులు నొప్పఁగ శైలరసర్తు విశాలయతిన్
సముచితనాన్వితషడ్జలగంబుల జానుగఁ బాడిరి చక్రధరున్
రమణులు సొంపలరం గవిరాజవిరాజితమున్ బహురాగములన్. 106

అశ్వలలితము. ఇనవిరమంబున న్నజభజంబులింపుగ భజంబులున్ భవములై
చనఁ జన నొప్పునశ్వలలితంబు సత్కృతులఁ జెప్పఁగా విశదమై
యనుపమవైభవోజ్జ్వల హరీ సహస్రకరదోర్విదారణచణా

నినుఁగొనియాడ ధన్యుఁడు గదయ్యా నీ కరుణ దాననంత మగుటన్. 107

పద్మనాభము. మున్నెవ్వరున్ లేని కాలంబునన్ సృష్టి మూలంబుగాఁ బద్మగర్భు సృజించెన్
మున్నీటిలోఁ బాపతల్పంబు పై వెన్ను మోపెం ద్రిలోకంబులుం గుక్షి నుండన్
ఎన్నంగ నీతం డనాద్యంతుఁ డంచున్ నిరీక్షింతు రెవ్వారి వాఁడెల్లనాఁడున్
నన్నేలు నా నర్కవిశ్రాంతమై పద్మనాభం బగున్ సప్తతంబు ల్గగంటున్. 108

సంకృతిచ్ఛందము

అష్టమూర్తి. శ్రీనాథున్ సరసిజాక్షున్ సితసరోజాతనాభున్ జితనిశాటవరేణ్యున్
గానోదంచితరసజ్ఞుం గరిభయధ్వాంత భానున్ గనకవస్త్రవిలాసున్
జానొంద న్మనతయుక్తిన్ సరభజల్ యాంతమై కుంజరయతిద్వయ మొప్పం
గా నిట్లం పెసఁగఁ జెప్పెం గవిజనం బష్టమూర్తిన్ ఘనసమాగమరీతిన్. 109

సరసిజము. మౌళిం బిల్లంగోలొకచేత న్మటియొక కరమున మణిమయలతయున్
బాలశ్రేణుల్మ్రోల వసింపన్ బసులనొదిగి చనుపసగల ప్రభువున్
జాలం గొల్వంజాలినకోర్కుల్ సఫలములగు ననసరసిజమమరున్
బోలన్ బ్రహ్మవ్యాళవిరామ స్ఫురదురుమతయనములు నననసలున్. 110

క్రౌంచపదము. కాంచనభూషాసంచయ మొప్పన్ ఘనకుచభరమునఁ గవు నసియాడన్
జంచలనేత్ర ల్వంచనతోడన్ సముచితగతి వెనుచని తనుఁగొల్వన్
అంచితలీల న్మించినశౌరిన్ హరిదిభపరిమితయతు లొనఁగూడన్
ముంచి రచింపం గ్రౌంచపదం బిమ్మొగి భమసభననముల నయలొందున్. 111

అతికృతిచ్ఛందము

బంధురము. ఋభువులు దితితనయులు సమబలులై యెంతయు మత్సరము ల్బెరయన్
రభస మలరఁ గలశనిధిఁ దఱవఁగం గ్రక్కునఁ గవ్వపుఁగొండకు నీ
ప్రభు వనువుగఁ గుదురుగ నిలిచె ననం బంచదశాక్షరవిస్రమమై
ప్రబ మిగులఁగ నననననసభభభగల్ బంధుర వృత్తము చెప్పఁదగున్. 112

భాస్కర విలసితము. గోపనికరముల నేలినవానిన్ గోవృషదనుజుల నడఁచినవానిన్
గోపికలను బ్రమయించినవానిన్ గుబ్జకు విలసన మొసఁగినవానిన్
గోపకులము వెలయించినవానిన్ గొల్చెద మని బుధు లినయతిఁ బల్కన్
బ్రాపుగ భనజయభాశ్రిత నాసల్ భాస్కర విలసితమగు గురుయుక్తిన్. 113

ఉత్కృతిచ్ఛందము

భుజంగ విజృంభిత. స్వారాజారి వ్రాతారాతీశశిపనసమనయన సర్వదా మునివందితా
గౌరీశాద్యామర్త్యస్తుత్యా కమలభవజనక మధు కైటభాసురమర్దనా
శ్రీరామాహృత్స్వామీ యంచున్ జెలఁగి మమతనననలఁ జెంద రేఫసలున్ లగన్
ఘోరాఘౌఘాభిద్వేషిం బేర్కొనఁగ వసుదశయతియగున్ భుజంగవిజృంభితన్. 114

మంగళమహాశ్రీ. చిత్తములఁ జూపులను జిత్తజుని తండ్రిపయిఁ జెంది గజదంతియతు లొందన్

నృత్తములతోడఁ దరుణీమణులు గానరుచు లింపుగను మంగళమహాశ్రీ
వృత్తములఁ బాడిరి సవృత్తకుచకుంభముల వింతజిగి యెంతయుఁ దలిర్పన్
మత్తిలుచు నబ్భజసనంబు లిరుచోటులఁ దనర్పఁగఁ దుదన్ గగ మెలర్పన్. 115

## అసమవృత్త భేదములు

వ. మఱియు నర్థసమవృత్త విషమ వృత్తంబు లెట్టి వనిన. 116

క. ధరనొకటియు మూఁడును నగు
చరణంబులు మఱిద్వితీయ చాతుర్థిక వి
స్ఫురితాంఘ్రులుఁ దమలోనను
సరి యగునర్థసమవృత్తచయమునఁ గృష్ణా! 117

గీ. జరగునందు స్వస్థానార్థసమ మనంగ
ఛంద మొకటన నిట్టిలక్షణముదగుల
నమరుఁ నట పరస్థానార్థసమము నాఁగ
నెలమిఁ దరువాతి ఛందంబు గలయఁ గృష్ణ. 118

సీ. విషమ వృత్తంబులు వెలయు బాదంబుల గణములు వేర్వేఱుగా నొనర్ప
నవియు స్వస్థానంబు నటపరస్థానంబు సర్వపరస్థానసంజ్ఞికంబు
నొక్క ఛందంబున నొగిఁ గొని పాదముల్ వేఱైన స్వస్థానవిషమ మయ్యె
నొకపాద మొక్కట నున్న పాదంబులు క్రిందటి ఛందంబునందు నైన
తే. మీఁది చందంబునందైన మెఱయఁ జెప్ప
నవి పరస్థాన విషయ వృత్తాహ్వయములు
వెండి సర్వపరస్థాన విషమమునకు
నన్నియునుఁ జెప్ప ఛందంబు లబ్జనాభ. 119

స్వస్థానార్థసమవృత్తములు

నారీప్లుతము. క్షీరోదన్వన్మధ్యగేహ మతాగా
సారంబు నుద్యత్తతజ ల్గగంబున్
బూరింపంగాఁ బాదముల్ రెంట రెంటన్
నారీప్లుతం బయ్యె ననంతమూర్తీ! 120

పరస్థానార్థసమవృత్తములు

మనోహరము. క్ష్మారాజ రమేశ జతావము లు
ద్ధుర మైనసకారచతుష్కముతోఁ
గూరంగ సగంబులు గూడి మనో
హరవృత్తము చెల్వగు నద్రిధరా! 121

స్వస్థానవిషమవృత్తములు

అంగజాస్త్రము. భూరిభమంబుల్ పొందు సగం బిం
పారఁగ నర్థంబై యటసామున్
శౌరీ విన్మసజంబు గాంతమై
యారూఢం బగు నంగజాస్త్రమున్. 122

వరాంగి. సరిత్పదాబ్జా జతజల్ గగల్ బం
ధురం బగున్ రెంట జతుర్థకాంఘ్రిన్
గారాముతోఁ దాజగగల్ వరాంగిన్
హరార్చితా మూఁడవయంఘ్రి నొందున్. 123

నదీప్రఘోషము. నాగతల్పా మొద ల్నాల్గు రేఫంబులున్
జగన్నివాసా జతజంబు రేఫయున్
దగంగ నమ్మూఁడు పదంబులందు జా
తిగాఁ బ్రవర్తించు నదీ ప్రఘోషకున్. 124

పరస్థానవిషమవృత్తములు

శ్రీరమణము. ధాత్రి భమంబుల్ తత్సగ మాదిన్
భత్రయగాగణపద్ధతి మూఁటన్
గోత్రధరా యిటు గూర్పఁ బదంబుల్
చిత్రగతిం జను శ్రీరమణంబుల్. 125

రథగమన మనోహరము. రథగమన మనోహరంబు రెండవఘ్రిన్
ప్రథితం బగున్ సజజంబు రప్రయుక్తయంబున్
ప్రథమపదమునందుఁ బైసగంబునందున్
గథితననరజంబు గద్వయంబుఁ గృష్ణా! 126

సర్వపరస్థానవిషమవృత్తములు

వీణారచనము. వీణారచనం బయ్యె భువిన్ తయసాగల్
బాణప్రహరా తజనభభవ్యగగంబుల్
చాణూరహరా తజనభస ల్ప్రకటయతిన్
వేణుధర భననభసవిశ్రుత మగుచున్. 127

పంచపాది (సమవృత్తము)

క. పాదచతుర్వృత్తంబున
నాదరమునఁ బంచపాది యనుసమవృత్తం
బైదవపదంబు గలిగిన
మాదయితా కృతులయందు మహనీయ మగున్. 128

ఉ. శ్రీసతిఁ బేరురంబున ధరించినభోగి చతుర్ముఖుండు నా
భీసరసీరుహంబునకు బిడ్డఁడుగా విలసిల్లి మేటి కై
లాసనగాలయుండు జడలన్ సవరించినయేటిపుట్టినిల్
భాసురపాదపద్మ మగుబల్లిదుఁ డివ్విభుఁ డంచు సన్నుతుల్
సేసిరి సన్మునీంద్రు లనఁ జెన్నగువృత్తము పంచపాదియై. 129

ఉద్ధురమాలా వృత్తములు

క. పరఁగఁగ నిఱువదియాఱు
క్షరములకును నధిక మగుచుఁ జరణంబుల ను
ద్ధురమాలావృత్తంబులు
జరగు లయగ్రాహి మొదలు జలరుహనాభా! 130

లయగ్రాహి. ఎందు నిల దేజనులకుం దలఁపరానితప -
మందికొనిచేసిరొకొ నందుఁడు యశోదా
సుందరియుఁ బూర్ణనిధిఁ బొందిరి కడుందొరసి -
పొందగునుముప్పతటి నందనునిగా శ్రీ
మందిరుని నంచు నిటు లందముగఁ బ్రాసములు -
గ్రందుకొని చెప్పుమునిబృందము లయగ్రా
హిం దనర నబ్బజనలుం దగ నకారమును -
బొంద నిరుచోట్లని బిఱుంద భయ లొందన్. 131

లయవిభాతి. పడయరె తనూభవులఁ బడయుదురు గాక పెర -
పడఁతులును భర్తలను బడసిరె తలంపన్
బుడమి నలనందుఁడును బడఁతుక యశోదయును -
గడుపున జగత్త్రయము నిడికొనిన పుత్రున్
బడసిరఁట యంచు బెడఁ గడరునసనత్రివృతి -
గడనసగముల్ పొసఁగ నిడ లయవిభాతిన్
నొడువుదురు సత్కవు లెపుడును విరితేనియలు -
వడియు పగిదిన్ రసము కడలుకొనుచుండన్. 132

లయహారి. చదువులును గిదువులను జదువ ధన మొదవు నని -
మదిఁ దలఁపవలదు మును చదివిరె ధరిత్రిన్
సదమలినహృదయుఁ డనఁ బొదలు దితిసుతసుతుఁడు -
మొదలఁ బలికినపలుకు జదువఁగ ముకుందుం
డద నెఱిగిఁ కదిసెఁ గద! చదివినభృగువుకొడుకు -
చదువుతుది నొకపనికి నొదవెనె యటంచున్
పదునొకఁడు నగణములు గదిసి సగమొనయ భువి -
విదితముగ బుధులు పలుకుదురు లయహారిన్. 133

త్రిభంగి. ననసన ననసస లును భమసగలును -
దనరి నటింపఁ గణంకన్ నలువంకన్ బెంపుదొలంకన్
మునుకొని నఖముఖమున వెడఁగదలుపఁ -
జనుఁ గడునొప్పగువీణల్ నెరజాణల్ వేలుపుగాణల్
వనరుహ జనితుని తనయులు మొదలుగ -
ఘనమతులాదటతోడన్ శ్రుతిగూడన్ వెన్నునిఁబాడన్
వినఁగలిగిన నదిజననము ఫలమని -
మునిజను లిందు శుభాంగున్ దగుభంగిన్ జెప్పుఁ ద్రిభంగిన్. 134

దండకము. సిరి నేలు రసికుండు శ్రీవత్సవక్షుండు నీరేరుహాక్షుండు నిత్యాసదృక్షుండు త్రైలోక్య
సంరక్షణోపాయ దక్షుండు మాపాలి దేవుండు ధీరుం డుదారం డితం డిచ్చు మాయిచ్చకు
న్వచ్చు సౌఖ్యమ్ము లంచు న్మదిం గోరి పెద్దల్ స కారంబుతో సంగతం బై నహం
బాది నొండెన్ దకారాదిగా నైన; లో నెల్ల చోటన్ దకారంబులం బెల్లు చెందన్
గకారావసానంబు నై దండకాకార మేపారఁ గీర్తింతు రెల్ల ప్పుడున్. 135

గద్యము. ఇది శ్రీవాణీవరప్రసాదలబ్ధవాగ్వైభవ తిక్కనామాత్య తనుసంభవ

సుకవిజనవిధేయ
అనంతనామధేయ ప్రణీతం బైన ఛందోదర్పణంబునందు నుభయభాషానురూపంబు లగు గద్యపద్యంబుల విధంబును షడ్వింశతి చ్ఛందోనామంబులును, తదుద్భవంబు లగు సమ వృత్తంబులును, వృత్తమిశ్రంబు లగు నర్ధసమవిషమ వృత్తంబులును, ఛందోఽతిరిక్తంబు లగు మాలా వృత్తంబులును, తద్భేదం బగు దండకంబు నన్నది ద్వితీయాశ్వాసము.

శ్రీ రామాయనమః.

# ఛందోదర్పణము

## తృతీయాశ్వాసము





మదనంతశయన భవ
భీమదహన నిఖిలహరణభీషణవర్షా
సామజభీతి నివారణ
కామజనక శిష్టలోకకామితవరదా. 1

### కందములు

క. నలగగభజసలు కందం
బుల మూఁడును నైదు షష్ఠముల నలజలు బే
సుల జగణరహిత మంత్యగ
మలఘుపదత్రిగణవిరతి యర్థముల హరీ! 2

### ఆర్యలు

#### ఆర్య

గీ. కంద మరయ నార్యాగీతికడగణంబు
నపరషష్ఠంబు గురులఘు లైననార్య
నలఘు లాఱింట గిరిశరస్థలుల నున్న
నగు ద్వితీయ ప్రధానలఘ్వాదియతులు. 3

క. వడియగు నార్యకు రెండవ
యడుగునఁ ద్రిగణంబుమీఁదఁ నంధ్రకవితకున్
గడపటిపాదమునకు వడి
యడరును ద్విగణయుతలఘువు కవ్వలిచోటన్. 4

ఆ. సరవిఁ బథ్య విపుల చపలార్య ముఖ జఘ
నాఖ్యచపల లనఁగ నార్య లైదు
నొనర గీతి యనఁగ నుపగీతి యుద్గీతి
యార్యపేరిగీతి యనఁగ నాల్గు. 5

## పథ్యార్య

క. బేసులు త్రిగణయుతములై
యాసమపాదములఁ బొరసి యార్య యనఁ గడున్
భాసిల్లుఁ బథ్య యనఁగా
వాసవముఖ సకల దివిజ వర్గ ప్రణుతా! 6

## విపులార్య

క. ప్రకట సమపాదముల నిలు
వక శబ్దమునవలఁ జొచ్చి వచ్చె ననం ద
క్కక విపులార్య యగును సే
వకజనమందార ధీర వనజదళాక్షా! 7

## చపలార్య

క. వరుసను ద్వితీయ మంత్యము
స్ఫురణ న్మద్యగజకారములను దగన్ రెం
డరయఁగ దనర్చు నేనిన్
సరవి నదియ హరి మురారి చపలార్య యగున్. 8

## ముఖచపలార్య

క. చపలాగణప్రకారం
బపారకారుణ్యసాగరా ప్రథమార్థం
బపరం బగుచున్నది ముఖ
చపలార్య యనంగఁ జనును జక్కఁగ గృతులన్. 9

## జఘనచపలార్య

క. మొదలిసగము చపలార్య
స్పదగణలక్షణము సొరక చరమార్థం బం
దుదితప్రకార రేఖన్
గదాధరా చనుఁ గృతుల జఘనచపలార్యన్. 10

## గీతులు

## గీతి

క. లసదార్య మొదలిసగమున
నెసగఁగ రెండరలుఁ జెప్పిరే నదియే గీ
తి సమాహ్వామ మగుఁ గృతులన్
వసుధాధం కృష్ణ యాదవస్వామి యనన్. 11

## ఉపగీతి

క. ధర నార్యమీఁదిసగమున
నిరుసగమున నట్ల చెప్పి రేని యదియ దాఁ
బరఁగు నుపగీతి యనఁగా
సరసిజదళనేత్ర కృష్ణశార్ఙ్గధర హరీ! 12

## ఉద్గీతి

క. విదితార్యచరమదళమున్
మొదలి సగము చేసి యందు మొదలింటిసగం
బది యపరార్థముఁ జేసినఁ
బొదు వగు నుద్గీతి భుజగభుగ్వరగమనా! 13

## ఆర్యాగీతి

క. కందములకుఁ గలనియమము
లం దేమియుఁ గడమ వడక యడరిన నది యిం
పొందఁగ నార్యాగీతి య
నం దగు ని ట్లురగభూషణ ప్రణుత గుణా! 14

# సమ విషమ గీతులు

క. అమర మఱిగీతులందు వి
షమగీతులు మూఁడు రెండు సమగీతులు నై
సమము లగు నపకలిప్రా
సముల యతుల విషమములఁ బొసఁగు బ్రావళ్లున్. 15

ఎత్తుగీతి. ఆదిప్రాసంబు హరియు
నాదిత్యయుగము నగుచు
నీదెసయతుల నెత్తు
గీదియ నెగడుఁ గృష్ణ. 16

పవడగీతి. పవడగీతియందుఁ బ్రాసంబు నిలిచి మూఁ
డవగణంబుమీఁద నమరు విరతి
రవులు ముప్పురును బురందరు లిద్దఱు
నవుల నేగు రినులు నర్ధములకు. 17

మేలనగీతి. నగణమొండె హగణమొండె నగణహగణయుగము

తగిలియుండె సప్తసంఖ్య తత్పదంబు లమరఁ
దగుఁ జతుర్థగణముపై నుదాత్తవిశ్రమంబు
నిగుడుమేలనాఖ్య గీతి నెరయుఁ బ్రాస మొదవి. 18

## సమ గీతులు

ఆ. ఇనులు ముగురు పాద నిద్ద ఱింద్రులు మృదం
గములు దాల్ప వంశకాహళాదు
లేగురర్కు లూఁద నిరుమేళగతి నాట
వెలఁది యొప్పుచుండు విష్ణుసభల. 19

తే. ఒక్కఁ డర్కుఁ డిద్దఱుజిష్ణు లొనర మఱియు
నిద్ద ఱర్కు లీచొప్పున నేగురేసి
నాల్గువంకలఁ గదిసి వర్ణన మొనర్పఁ
తేటగీతి విష్ణునివేర్మిఁ దేటపఱుచు. 20

క. పెనఁగి గణత్రియతములై
నొనరఁగ వడియొండెఁ బ్రాసమొండెను నిలుపన్
జను నాటవెలఁది యందును
ననువొందిన తేటగీతి యందు ముకుందా! 21

## సీసంబులు

క. నలనగసలభరతలలో
పల నాఱును మీఁద రెండుఁ బద్మాప్తగణం
బులఁ దగి నాలుగుపదములఁ
జెలు వగు నొకగీతితోడ సీసము కృష్ణా! 22

క. సీసము రెండుగణంబులఁ
బ్రాసం బేనియును మఱి విరామంబైనన్
భాసిల్లుఁ బృథివిమీఁదన్
జేసిన నియమములఁ బ్రాససీసాదులజా! 23

సీ. వృత్తంబులకుఁబోలె వెలయు నాల్గడుగునఁ - బ్రాసముల్నిల్పి విరతులు నునుపఁ
బ్రాససీసము లగుఁ బశ్చిమార్ధములట్ల - భాసిల్ల నక్కిలి ప్రాససీస
మగు మున్నుగైకొన్న యతిపాదమందెల్ల - నడరిన వడిసీస మనుఁగఁ బరఁగు
నర్ధమర్ధమునకు యతులు వేఱై చనఁ - జెప్ప నక్కిలివడి సీసమయ్యె.
గీ. నవకలికి నిట్లు ప్రాసంబు లవతరిల్లు
యతులు ప్రాసంబు లిష్టసంగతుల నడవ
నదియ సమసీస ముత్సాహ తుదనుగీతి
పరఁగ విషమసీసం బగుఁ బద్మనాభ! 24

గీ. అగు సమప్రాససీస మాఱడుగులందు
నాలుగింట వృత్తప్రాసనామసీస
మన్ని చోటులఁ బ్రాసంబు నందెనేని

సర్వతః ప్రాససీసంబు జలజనాభ! 25

సమ సీసము. ఇందులు తమలోన నిద్దఱిద్దఱుఁ గూడి - యతులకు నాధార మై తనర్చి
మూఁడుచోటుల నుండ మొగి నిద్ద ఱర్కులు - గదియ నాక్రియ నొక్క పదము మెఱయ
నిటువంటి పదము లింపెసఁగంగ నాల్గింట - సమధర్మగతి నతిశయము నొందు
నట్టిధర్మమునకు నాస్పదంబై పేర్చి - యాతతచ్ఛందోవిభాతిఁ దనరి
ఆ. ఆట వెలఁది యొండెఁ దేటగీతియు నొండె
విమలభావ మమర విష్ణుదేవుఁ
డొప్పు ననుచుఁ బొసఁగఁ జెప్పిన సీసంబు
పసిఁడి యగు ధరిత్రిఁ బద్మనాభ! 26

ప్రాస సీసము. భామినిచే నున్న పట్టుతోరముఁ జూచి - ప్రల్లదంబునఁ ద్రెంచి పాఱవైచి
యామునిద్రోహ మత్యంత మై తనుఁ బట్టి - యతిదరిద్రునిఁ జేయ నార్తి నొంది
భూమి వెల్వడి పోయి పురపురఁ బొక్కుచుఁ - బుండరీకాక్ష యోభువనవంద్య
స్వామి నాయపరాధశతసహస్రంబులు - సైరింపవే కృపాజలధి యనుచు
గీ. ప్రేముడించు కౌండిన్యునిభీతిఁ బాపి
పృథులసౌఖ్యంబు లొసఁగి గాంభీర్యమమరఁ
బాముపైఁ బవ్వళించిన ప్రభుఁడ వనినఁ
బ్రాససీసంబు విలసిల్లుఁ బద్మనాభ! 27

వృత్తప్రాససీసము. శ్రీశ్రితవక్షుండు సింధురవరదుండు - చింతిత ఫలదానశీలుఁ డితఁడు
ఆశ్రితావనలోలుఁ డాభీరకాంతాకు - చాగ్రకుంకుమభూషితాంగుఁ డితఁడు
ఆశాంతజయధాముఁ డాశాంతవిశ్రాంత - యశుఁడు ధరాధరశ్యాముఁ డితఁడు
విశ్రుతవిభవుండు విపులబలాఢ్యుండు - వికసితవదనారవిందు డితఁడు
గీ. అనుచు మునులును దివిజులు నభినుతింపఁ
జూపు చెవులపొన్నున వెన్ను మోపియుండు
నంబుజోదరుఁ డంచు ని ట్లాంధ్రకృతులఁ
జెప్పిరేని వృత్తప్రాససీస మగును. 28

సర్వతఃప్రాససీసము. నీరదవర్ణుండు నీరేరుహాక్షుండు - నీరధిబంధనోదారబలుండు
కారుణ్యరసరాశి గౌరీరసజ్ఞా వి - హారిశోభితనామగౌరవుండు
ధీరుండు త్రిభువనాధారుండు దశరథ - క్ష్మారమణేంద్రకుమారవరుఁడు
మారీచదమనుండు నారాచవిద్యావి - శారదుం డసురవిదారణుండు
గీ. ధారుణీసుత నయనచకోరసరసి
జారి యన సర్వతఃప్రాసచారుసీస
మారయఁగ సత్కవిజనవిస్ఫారనుతులఁ
దేరు శ్రీపద్మనాభ శృంగారసార! 29

అక్కిలిప్రాస సీసము. ఉరగతల్పుని గాని యుల్లంబులలో నిల్ప - శరధితల్పుని గాని సన్నుతింప
మురసంహరుని గాని మ్రొక్కులఁ గయిసేయ - నరమృగేంద్రులఁ గాని నమ్మికొలువ
గరుడవాహను పేరుఁగాని వీనులఁ జొన్ప - బురుషోత్తముని గాని పూజసేయ
హరిప్రసాదముఁ గాని యర్థిమైఁ గొననొల్లఁ - బరమాత్ముపనిఁగాని భక్తిఁ బూన
గీ. ధరని నవినాదు నిత్యవర్తనము లనుచుఁ
బరఁగు వ్రతిఁగాని నీవు చేపట్టవనిన

జరుగు నక్కిలిప్రాస సీసంబు కృతులఁ
బరభృతాతసిపుష్పాభ పద్మనాభ! 30

వడిసీసము. కరుణాసముద్రుండు గజరాజవరదుండు - గర్వితాసురశిరఃఖండనుండు
విహగేంద్రవాహుండు విబుధేంద్రవంద్యుండు - విశ్వరక్షాచణవీక్షణుండు
రతిరాజజనకుండు రఘువంశతిలకుండు - రణబలోదగ్రుండు రమ్యగుణుఁడు
గోకులాధీశుండు గోపికారమణుండు - గోవిందుఁ డురుకళాకోవిదుండు
గీ. అనుచు వడిసీసముల నిన్ను నభినుతింతు
రఖిల విద్యావిశారదు లైన మునులు
పన్నగాధీశతల్ప నాపాలివేల్ప
భక్తజనకామ్యలాభ శ్రీపద్మనాభ! 31

అక్కిలివడిసీసము. పద్మాక్షి యీతఁడే బలి రసాతల మేలు - మని పంపనేర్చిన యధికబలుడు
హరిణాక్షి యీతఁడే యలవిభీషణు లంకఁ - బట్టంబు గట్టిన బల్లిదుండు
తొయ్యలి యీతఁడే ధ్రువుని నున్నతపదం - బునఁ ప్రతిష్ఠించిన భూరియశుఁడు
ధవళాక్షి యీతఁడే ధనువు ద్రుంచినయట్టి - రఘువంశ తిలకుండు రాఘవుండు
గీ. బాణ బాహావిఖండన ప్రముఖుఁ డితడు
నీలగళసుప్తికరబాణనిపుణుఁ డితడు
ననుచు నక్కిలివడిసీస మమర వేల్పుఁ
బడఁతు లభినుతింతురు నిన్నుఁ బద్మనాభ! 32

అవకలిప్రాస సీసము. వరదుఁ డుద్యద్గుణాకరుఁడు వియన్నదీ - పాదుఁడు భక్తప్రమోదకరుఁడు
సింధుబంధనుఁ డబ్జబంధు తారాధీశ - నేత్రుఁడు కాశ్యపగోత్రజుండు
సుగ్రీవ విభుఁడు దశగ్రీవదమనుండు - లలితకంబుగ్రీవవిలసితుండు
పూతనాజీవితనూతనస్తన్యపా - నాభిలోలుఁడు నిత్యశోభనుండు
ఆ. భువనవంద్యుఁ డనుచు నవకలిప్రాససీ
సముల నిన్నుఁ బొగడు నమరసమితి
శరణభరణనిపుణ వరయోగవిమల హృ
త్పద్మసద్మదేవ పద్మనాభ! 33

## విషమసీసము

ఉత్సాహ. సాహచర్య మమర సప్త సవితృవర్గమును సము
త్సాహ మెక్క నొక్కగురుఁడు చరణములు భజింపఁగా
నీహితప్రదానలీల లెసగుకమఠమూర్తి ను
త్సాహరీతు లుల్లసిల్ల సంస్తుతింతు రచ్యుతున్. 34

ఆ. ప్రాసములును వడులు భాసురంబుగ నిట్లు
విలసితముగ నాటవెలఁదియందు
నుత్సుకత నొనర్చి యుత్సాహ మది నిల్ప
విషమసీస మమరు విషధిశయన! 35

క. ద్వాదశపదమగు మఱి య
ష్టాదశపాదమగు గీతి సహితంబుగఁ దా

నేదియగు సీసమాలిక
శ్రీదయితా నిలుపవలయు సీసపునియతిన్. 36

క. సర్వలఘుసీసమునకు స
ఖర్వాంఘ్రులనడుమ నింద్రగణములు మాఱై
యార్వంచల లఘుగణంబులు
నుర్వీధర త్రిలఘుయుగము నొకగీతితుదన్. 37

సర్వలఘుసీసము. మృగమదము తిలకమును నగు మొగముచెలువమును - నలఁతిపవడముఁ దెగడు నధరపుటము
వలుదజఘనములు బొలుపలరుకనకపువలువ - కలితకరచరణమణికటకములును
విరులతురుమును నమిలిపురిసొబగుగుమకరికము - రచన నెసఁగిన చెవుల రవణములును
కరకమలయుగళ ధృతి మురళియును ద్రివిధమగు - నిలుకడయు నిటలతటి నెఱయు కురులు
గీ. తెల్లదమ్మిరేకులభంగి నుల్లసిల్లు
వెడఁదకన్నులు గలగోపవేషశౌరి
నాశ్రయించెద ననుచు ని ట్లమరఁ జెప్ప
సర్వలఘుసీస మగు నండ్రు జలజనాభ! 38

## తరువోజ

తరువోజ. ముగురు జిష్ణులు త్రయీమూర్తియు మఱియు - ముగురు జిష్ణులు త్రయీమూర్తియుఁ గూడి
యొగి నుండ గరయతి నొక్కొక్క చరణ - ముడుగక సేవింప నుజ్జ్వలం బగుచుఁ
దగ నుల్లసిల్లు పాదములు నాల్గింటఁ - దనరు వరాహావతారోదయునకు
నిగురొత్తు భావంబు లెసఁగఁ దర్వోజ - నీయోజ నొనరింతు రెల్ల సత్కవులు. 39

## అక్కరలు

మహాక్కర. ఆదివార మాదిగ ననుక్రమమున - నన్నివాసరముల నొక్కినుండు
నాదితేయాధినాథు లేగురు నల - రారంగ నొక్కసుధాకరుండు
నాది హరిఁ గొల్వ రెండును నాలుగు - నగు వాసరంబున నర్కుఁడైన
నాదరంబున నెడసొచ్చునని మ - హాక్కరం బలుకుదు రార్యు లెల్ల. 40

మధ్యాక్కరము. ఓజతో నిద్దఱింద్రులును నొక్కయాదిత్యుండు మఱియు
రాజితంబుగ నిద్ద ఱమర రాజులు నొక్కసూర్యుండు
పూజింతు రత్యంతభక్తిఁ బుండరీకాక్షు ననంతు
భ్రాజిల్లు బుధులు మధ్యాక్కరంబు నొప్పారఁ బల్కుదురు. 41

మధురాక్కరము. రవియు నింద్రులు ముప్పురు రాజొకండును గలిసి
రవిసుధాకరలోచను రాజితాననసరోజు
రవికులేశుఁ గొలుతు రని ప్రస్తుతింతురు ధరిత్రి
నవిరళం బగుమధురాక్కరాఖ్యచే సత్కవులు. 42

అంతరాక్కరము. ఇనుఁ డొకండును నింద్రు లిద్దఱును నొక్క
వనజవైరియుఁ గూడి వైభవ మొనర్ప
గనకవస్త్రుని గృత్తకైటభుని గొల్తు
రనుచుఁ జెప్పుదు రంతరాక్కర బుధులు. 43

అల్పాక్కర. ఒగి నిద్దఱింద్రులు నొకవిధుండు
జగతీధరుని పదాబ్జములు గొల్తు
రగణితభక్తి నంచభినుతింప
నెగడు నల్పాక్కర నియతితోడ. 44

క. విరతి చతుర్గణము మహా
క్కర కేకోనాక్షరత్రిగణ మంతరకున్
వరగణయుగయతి నల్పా
క్కర మధ్యయు మధురయుంద్రిగణయతుల హరీ! 45

షట్పదము. మెఱియంగ నిద్దఱి
ద్దఱు సురేంద్రులుమూఁడు
తెఱఁగులన్ శశిఁగూడ నర్థంబులన్
నెఱిఁ గ్రాలఁగా వళ్ళు
దొఱఁగ షట్పదరీతి
వఱలుఁ జక్రిపదాబ్జవర్ణనంబు. 46

త్రిపద. సరవిఁ బ్రాసమునొంది సురపతుల్ నలువురు
హరియు గై కార్కులు కలియ
జరగు నిప్పగిది యై త్రిపద. 47

ద్విపద. ఇంద్రులు ముప్వురు నినుఁ డొక్కరుండు
సాంద్రమై యొక్కొక్కచరణంబుఁ గొలువ
నలరుఁ బద్మోదరుఁ డంచు ధీరోత్త
ములు విస్తరింతురు ముదముతో ద్విపద. 48

మంజరీ ద్విపద. శ్రీమందిరాకారు జితదైత్యధీరుఁ
గీర్తించుచోఁ బుణ్యావర్తనుం డనుచు
యతిమాఱుప్రాస మి ట్లచ్చోట నిడక
సరసిజనాభాయ సముదగ్రసాహ
సాయ నమోయంచు శబ్దమొక్కటియు
రెండుపాదముల నీక్రియఁ బంచియిడక
వెలయు ప్రాసములేని ద్విపద యై పరఁగఁ
బూజింపవలయును వాక్పుష్పమంజరుల. 49

చౌపద. కలసి చతుర్లఘుగణములయందు
నలిఁ ద్రిగణం బై నగణము వొందు
నలరుగణద్వయ యతిగోవిందుఁ
బలుకఁ గృతులఁ జౌపద చెలువందు. 50

వితాళ(చౌపద)ము. అర్కనామగణ మనువుగ రెండు

దార్కొని లఘువొందఁగ నిట్టుండుఁ
దర్కింపఁగను వితాళము నండు
పేర్కొనఁ దగు హరిబిరుదులపిండు. 51

## రగడలు.

క. ఆద్యంత ప్రాసంబులు
హృద్యంబుగ రెంట రెంట నిడి పాదము లు
ద్యద్యతులఁ గూర్పఁ దగు నన
వద్యంబగు రగడలందు వారిజనాభా! 52

హయప్రచార రగడ. హనచతుష్టయంబు ఋతుల
జనితయతుల జరగుఁ గృతులఁ
జను హయప్రచార రగడ
వినుతశాస్త్రవిధులు వొగడ. 53

తురగవల్గన రగడ. శ్రీసతీశుఁ బరమపురుషుఁ జిత్తమున దలంచువారు
వాసవాదినిఖిల దివిజవంద్యు నాశ్రయించువారు
నిట జనింప రనఁగ నన్వయించుఁ దురగవల్గనంబు
పటుదినేశలఘువిరామ భానుమద్గణాష్టకంబు. 54

విజయమంగళ రగడ. శ్రీధరాయ శిష్టజననిషేవితాయ భక్తలోక
జీవితాయ గర్వితోరుసింధురాజబంధనాయ
గాధిపుత్రయజ్ఞ విఘ్నకరమహాసురీమహోగ్ర
కాయ శైలదళన నిపుణ ఘన సురాధిపాయుధాయ
కేశవాయ తే నమోఽస్తు కృష్ణ పాహిపాహి యనుఁచు
గేలుమొగచి మౌళినునిచి కృష్ణుఁ బలికెననుచునిట్లు
దేశభాషణములఁ జెప్ప ద్విగుణతురగవల్గనమునఁ
దేరు విజయమంగళంబు తీయచెఱకు రసమునట్లు. 55

ద్విరదగతి రగడ. శ్రీయువతి నిజయువతిఁ జేసి యెంతయు మించి
కాయజునిఁ దనతనయుఁ గా నెలమిఁ బాటించి
సకల దేవతలఁ బరిజనులుగా మన్నించి
ప్రకటగతి శ్రుతుల నుతిపాఠకులఁ గావించి
హరి యొప్పు నన నొప్పు నవతార లఘువిరతి
శరది నగనలలభలసలతరల ద్విరదగతి. 56

జయభద్ర రగడ. శ్రీకి నొడయం డనఁగఁ జిత్తజునిగురుఁ డనఁగ
శేషశయనుం డనఁగఁ జెలువుగఁ జతుర్భుజుఁడు
నాకౌకసుల నేలు నముచిసూదనువూజ
నతఁడు దాఁగైకొన్న నందగోపాత్మజుఁడు
ఇతనిఁ గొల్చినఁ గాని యిహపరంబులు గలుగ
వితరసేవల ననఁగ నెసఁగు నివ్విభుఁ డంచుఁ
జతురమతు లొనరింప జయభద్రరగడ లిటు

సద్ద్విరదగతి రెంటఁ జాటింపులం బెంచు 57

మధురగతి రగడ. శ్రీవనితాధిపుఁ జేరి భజింపుఁడు
భావజ జనకుని భక్తిఁ దలంపుఁడు
అని గగనలభసలను నాల్గిటఁ గృతి
జను గజలఘువిశ్రమము మధురగతి. 58

హరిగతి రగడ. శ్రీరామాకుచకుంకుమపంకము
చేఁ బొలుపగు విపులోరఃఫలకము
తారతుషారపటీరసమానో
దకవాహిని యొదవిన పదకమలము
నతిశయ మై యలవడు నేదెవుని
ననవరతోదారత నాహరిగతి
యితరుల కలవడ దని నృప లఘుయతి
నిభనలగగభసల నగును హరిగతి. 59

వృషభగమన రగడ. శ్రీమనోహరు నంబుజోదరుఁ
జిత్తజాతగురుం దలంచెదఁ
గామితార్థవిధాయి నిర్జిత
కాళియాహిని నాశ్రయించెద
ననువుగా భసనల భానుస
మన్వితద్వితయములు నాలుగు
ననిమిషాధిపలఘుయతినిడఁగ
నలరువృషభగమనము మేలగు. 60

హరిణగతి రగడ. శ్రీనివాసు భజింతు నే నని - పూని కుజనులపొంత బోనని
భానుయుతనలభసగగంబుల - లోననిరుదోలుననగంబుల
నిరవుగా నిరుమాఱులఘువుల - నెల్లవారును నొగి గణింపఁగ
విరతులను గావింపనిమ్ముల -హరిణగతి చెలువగు జగమ్ముల. 61

## చాటుప్రబంధ లక్షణము

సీ. ఒకపద్య మైన ముక్తకము రెండును మూఁడు - ద్వికమును ద్రికమునై విస్తరిల్లుఁ
బంచరత్నము లైదు పరఁగ నెన్మిది గజా - వళికి నామావళి ద్వాదశంబు
నెన్నంగ నిరువదియేడు తారావళి - యొనయు ముప్పది రెండు నేఁబదియును
నూఱునూటెనిమిది నుతికెక్కి ద్వాత్రింశ - దభిధాన పంచాశదాఖ్యనాఁగ
ఆ. వెలయు శతక మనఁగ వెండి యష్టోత్తర
శతక మనఁగ నిట్లు సకలసుకవి
సమ్మతముగ నెగడు జాటు ప్రబంధము
లభిమతార్థ రచన నబ్జనాభ! 62

## ఉదాహరణ లక్షణము

సీ. భాసిల్లు సప్తవిభక్తులందును మఱి - సంబోధనంబున సరవిఁగాఁగఁ
బ్రభునామయుతముగాఁ బద్య మొక్కటియును - దగఁజెప్పి రగడ భేదంబులందుఁ

గళికలు ప్రత్యేక దళము లెన్మిది చేసి - తత్పరార్థముల నుత్కళిక లనఁగ
నేకసమాస మై యేడుదళంబులు - తుద విభక్త్యర్థంబు దోపఁబలుక
గీ. దాని కెనగాఁగ జిక్కినదళ మమర్చి
ఫణితులోడఁగూర్చి సార్వవిభక్తికముగఁ
గట్టి కడపటిపద్య మొక్కటి రచింప
నది యుదాహరణం బగు నబ్జనాభ! 63

సీ. ప్రథమవిభక్తిఁ బరఁగు వీరావళి - మఱి ద్వితీయకుఁ గీర్తిమతి దలంప
సుభగాభిధాన మచ్చుగఁ దృతీయకుఁ జతు - ర్థికి భోగమాలిని దృఢముగాఁగ
క్షితిఁ బంచమికిఁ గళావతి కాంతిమతి షష్ఠి - కమరు నుదాత్త సప్తమికిఁ గమల
సంబోధనమునకు జయవతి యాగతిఁ - దగు విభక్త్యధి దేవతాచయంబు
గీ. నెలమి నయ్యైవిభక్తుల నెసఁగఁ జెప్ప
గావ్యములను సంతోషించి కరుణతోడ
నాత్మనామాభిరూపఫలాభివృద్ధి
భర్తలకుఁ గర్తలకుఁ జేయుఁ బద్మనాభ! 64

## షట్ప్రత్యయంబులు

క. క్రమమునఁ బ్రస్తారము న
ష్టకము నుద్దిష్టమును వృత్తసంఖ్యయు మఱి పెం
పమరు లగ క్రియయును న
ధ్వము లన షట్ప్రత్యయములు దనరు ముకుందా! 65

## ప్రస్తారము.

క. చాలుగ సర్వగురువు లిడి
లాలితముగ గురువుక్రింద లఘువును వలప
ల్లోలి సమంబులు డాపలి
వ్రాలకు గురువులను నిలుపఁ బ్రస్తారమగున్. 66

## నష్టలబ్ధి

క. నరు లర్థించినచోటుల
నరయఁగ లఘువులను బేసులం దొక టిడి చె
చ్చెర నర్థించిన చోట్లన్
గురువుల నిడ నష్టలబ్ధి కుంజరవరదా! 67

## ఉద్దిష్టము

క. ఒక్కటి మొదిలుగ నినుమ
ళ్లెక్కినచో లఘుయుతంబు లన్నియుఁ బ్రోగై
యొక్కటి కలియఁగఁదోఁచును
గ్రక్కున నుద్దిష్ట మిక్షుకార్ముకజనకా! 68

## వృత్తసంఖ్య

క. చేకొని ఛందోవర్ణము
లేకాదిద్విగుణితముగ నిడి కడలెక్కం
బ్రాకటముగ రెట్టించిన
శ్రీకరముగ వృత్త సంఖ్య శ్రీనరసింహా! 69

## లగక్రియ

క. ఒకటి గలసిన ఛందపు
టక్కరముల దొంతి యిడి యుపాంతములతుదిన్
జక్కఁగ నొక్కొక్కటిలోఁ
గ్రక్కున నొడఁగూర్ప నగు లగక్రియ కృష్ణా! 70

క. తొలుత ప్రతి సర్వగురువగు
లలి నేకద్విత్రికాదిలఘుయుతవృత్తం
బులు పరప్రతు లగుఁ జక్రా
కలితము లౌనెలవు లగు లగక్రియఁ గృష్ణా! 71

చ. సగణలగ క్రియాంక మగు చక్రమునం దొకఁ డాదిగాఁగఁద
ద్ద్విగుణము లడ్డవీథి నొదవింపఁగ వామగృహాంక సంఖ్యతో
నొగిఁదరువాతియిండ్ల ప్రతులొందనధోఽంకములన్ సమాధికం
బగు ప్రతిమానుచుంగడకొల ప్రతుల్ దొరలించినిల్పఁగాన్. 72

గీ. ఇందు సమమగునది తొల్తయిండ్ల వ్రాయఁ
బడిన సంఖ్యతో సమమైనఁ బ్రతికిఁ జేరు
నధిక మగునది వృత్తసంఖ్యాధికంబు
వ్రాయ రివి రెండు ప్రతులచక్రములయందు. 73

వ. సుప్రతిష్ఠకు లగక్రియాచక్రోద్ధారం బెట్టిదనిన. 74

చ. మునుగలయొండు రెండునిటమూఁడుగ మూఁడును రెండునైదునై
దును నట నాల్గుతొమ్మిదగుఁదొమ్మిదినెన్మిదియుం బదేడుగా
ననువగు పంక్తి రెండు మొదలైనవి నాల్గిట నాలుగాదిగా
నెనిమిదియుం దదాదికము లెల్లఁ బబాఱిటఁ గూడఁగా నగున్. 75

## అధ్వప్రక్రియ.

క. తిరముగ ఛందోఽక్షరములు
నురుతరముగ వృత్తసంఖ్యయను ద్విగుణము లై
పొరి నొక్కొక్కఁడు తొలఁగఁగఁ
బరిశిష్టాంగుళము లధ్వభాగ ముపేంద్రా! 76

క. కడపటి వృత్తంబుల యిను
మడి లోపలఁ బ్రథమ వృత్తమండలిఁ దీర్పన్
వడినిష్టచ్ఛందంబులఁ
బొడమిన వృత్తముల వెఱను పొలుపగుఁ గృష్ణా! 77

చ. ఒగిఁ బదుమూఁడు కోటులును నొప్పుగనల్వది రెండులక్షల్
దగఁ బదునేడు వేలు నుచితముగ నవ్వల నేడునూటిపై
నగణితవైభవా యిరువదాఱు గదా సమవృత్తభేదముల్
ప్రగుణితలక్షణస్ఫురణఁ బంచిన ఛందము లిర్వదాఱిటన్. 78

గద్యము. ఇది శ్రీవాణీవరప్రసాదలబ్ధవాగ్విభవ తిక్కనామాత్య తనుసంభవ సుకవిజనవిధేయ అనంతనామధేయ ప్రణీతం బైన ఛందోదర్పణంబునందు జాతిలక్షణలక్షితంబు లగు కందంబులును, మాత్రాలక్షణయుక్తంబు లగు గీతులును సీసంబులు నుత్సాహము దరువోజయు నక్కరయు షట్పదయుఁ ద్విపదయు మంజరియుఁ జౌపదయు రగడలును జాటు కావ్య ప్రమాణంబులును, ఉదాహరణంబులును, షట్ప్రత్యయంబులును, సప్తమప్రత్యయం బైన సమవృత్తముల వెఱసు తెఱంగు నన్నది తృతీయాశ్వాసము.

శ్రీ రామాయనమః.

# ఛందోదర్పణము

## చతుర్థాశ్వాసము



### దోషాధికారము



ధర తనురుచివిజితప
యోధర యనవరతఘోషయోషిత్పరిపీ
తాధర తల్పీకృతవసు
ధాధర రిపుభయదద ఘనగదాధర కృష్ణా! 1

క. జగమున దోషవివర్జిత
ముగఁ జెప్పఁగవలయుఁ గావ్యమ్ములు సత్కవు ల
ట్లగుటన్ దశదోషమ్ములు
తగఁ జెప్పెదఁ బూర్వకవిమతంబుగఁ గృష్ణా! 2

గీ. పదియుఁ గీడుఛందోయతిభంగములు వి
సంధికము పునరుక్తి సంశయ మపక్ర
మంబు వ్యర్థ మపార్థము మఱి విరూపి
తాపశబ్దవిరోధంబు లనఁగ గృష్ణ! 3

### దశదోషములు

#### 1. ఛందోభంగము

క. ఛందోభంగం బగు గురు
వొందెడునెడ లఘువుగాఁ బ్రయోగించుట గో
విందా యనిపలుకుచోట ము
కుంద యనుచుఁ బలుక నిట్లు కుంజరవరదా! 4

## 2. యతి భంగము

ఆ. విమల కమలనేత్ర విశ్వలోకస్తోత్ర
విమలదైత్యకులవినాశ యనుచు
వలయుచోట లేక వడి యొండుచోనుండఁ
బలికిరేని నియతిభంగ మండ్రు. 5

## 3. విసంధికము

ఆ. అమృత ఉదధిశయన అమర ఈశానుజ
అబ్జమందిరాస్య అబ్జమిత్ర
అనుచు నిట్లు సంధి నెనయని శబ్దముల్
దొరకుటయ విసంధిదోష మండ్రు. 6

## 4. పునరుక్తము

గీ. తొలుతఁ దా నెద్దియైననుబలికి మఱియు
నదియ పలికినఁ బునరుక్తి యండ్రు బుధులు
శబ్ద పునరుక్తి పూర్వోక్తమైన శబ్దమైన
నర్థపునరుక్తి యేకార్థమైనఁ గృష్ణ! 7

గీ. శబ్దపునరుక్తి యగుఁ గాంతిచంద్రుఁ డని వ
చించి మఱి కాంతి చంద్రుఁ డటంచుఁ బలుక
నర్థపునరుక్తి యగుఁ గీర్తి నమృతకిరణుఁ
దని యశోమృగాంకుం డన నబ్జనాభ! 8

క. పునరుక్తి దోష మొందదు
దనరుపదావృత్తి నభిమతంబుగ వీప్సన్
జనువినుతాభీక్ష్ణ్యంబునఁ
బొనరు క్రియాసమభిహారముననండ్రు హరీ! 9

సీ. ఈ వెన్నమ్రుచ్చు దా నిల్లిల్లు దప్పక - చొచ్చుఁ బొమ్మన వీప్స సొంపుమిగులు
ఇటువచ్చివచ్చి నీవేల నిల్చితి కృష్ణ - యనిన నాభీక్ష్ణ్యంబు పొనరియుండు
ఇమ్మిమ్ముశౌరికి నిమ్మపం దనఁ గ్రియా - సమభిహారంబు ప్రశంస కెక్కు
నీ చక్కఁదనమును నీమంచితనమును - బ్రీతిఁ గన్గొని ధాత్రి వ్రేత లైరి
ఆ. దండకావనంబు తాపసు లనఁ బదా
వృత్తి యుల్ల సిల్లు వినులకృతుల
భూరిపుణ్యశీల పునరుక్తిలాలన
ప్రకటపుణ్యశోభ పద్మనాభ! 10

## 5. సంశయము

ఆ. కడఁగి వానిఁ గదియఁగాఁ గదా నేఁడు నీ
కింతపట్టుగలిగె నిందువదన
ఊరకున్నఁ గలదొకో యని సంశయా
ర్థముగఁ బలుక సంశయము ముకుంద! 11

## 6. అపక్రమము

క. పదమున నాభికమలమున
హృదయమునఁ బయోజభవ రతీశ్వరదివిష
న్నదు లుదయించెం గమలా
స్పదనకు నను వ్యుత్క్రమం బపక్రమ మయ్యెన్. 12

## 7. వ్యర్థము

క. మును దాఁ బలికినమాటకు
ననుగుణములు గాక వ్యర్థ మగుమాటలతో
బెనఁచిన నది వ్యర్థంబనఁ
జనుదోషం బనిరి కావ్యచతురులు కృష్ణా! 13

ఆ. త్యాగి వగుదు నీవు తారంబు వెట్టవు
చేరి నిన్ను నడుగు వారు పెద్ద
యింకఁ గీర్తి బ్రాతియే యని యొరుఁ బల్క
వ్యర్థదోష మండ్రు వనజనాభ! 14

ఆ. ప్రేమ మెఱిఁగి వాఁడు బిగియుచు నున్నాఁడు
వానిఁ గసనెయొల్ల వాఁడుఁ నాకుఁ
గూర్పఁ దెఱఁగు లేదొకో నాఁగ విరహిణి
యందు నిట్లు వ్యర్థ మమరుఁ కృష్ణ! 15

## 8. అపార్థము

క. కరిచర్మము గైరికశిల
సురగిరి యని సముదయార్థశూన్యపదంబుల్
బెరసిన నపార్థ మగు నది
జరగు మదోన్మత్తబాలచరితలఁ గృష్ణా! 16

## 9. అపశబ్దము

ఆ. కనుఁగొనంగ నాదికవులకావ్యంబుల
లలితమైన లక్ష్యలక్షణముల
రూఢిగాని పెఱవిరోధోక్తు లపశబ్ద
సంజ్ఞికంబు లండ్రు జగతిఁ గృష్ణ! 17

వ. అవియెయ్యవియనినం గుసంధి, దుస్సంధి, చుట్టుంబ్రావ, వైరి
వర్గంబు, కాకుదోషంబు, కుఱుచకాకు, తెనుంగునకుఁ జొరని
సంస్కృతక్రియలంబెరయు దుష్ప్రయోగంబులు మఱియు
నిట్టి గ్రామ్యంబు లెన్ని గల వన్నియు నపశబ్దంబులు

వాని వివరించెద. 18

కుసంధి

క. మొదల నికారముపైన
చ్చొదవి యకారముగ దీనియొడయం డిది యె
ట్లొదవె ననక దీనొండయం
డిదెట్లొదవె ననుఁ గుసంధు లిన శశినయనా! 19

దుస్సంధి

క. క్షితి స్వరసంధి నకారం
బతిశయముగ నతఁడు నతఁడు ననుచో నతఁడు
న్నతఁడు నని యూఁది పలికిన
సతతము దుస్సంధి యండ్రు సత్కవులు హరీ! 20

చుట్టుఁబ్రావ

క. మొద లాఱు వడ్డి మూఁ డనఁ
గదియింపక యెత్తి కట్టి ఖరమున నగువాఁ
డిదె వచ్చెడి నన నెగ్గై
యొదవిన యాచుట్టుఁబ్రావ లొల్లరు కృష్ణా! 21

వైరివర్గము

ఆ. తుదలు తెలుఁగుఁ జేసి యదికి పుష్పవిల్లు
పరంగ భూరుహంపుఁబండ్లు నాక
పుష్పవిల్లు నాఁగ భూరుహపండ్లు నా
వైరివర్గ మండ్రు వనజనాభ! 22

ఆ. కోమటీండ్రునాఁగ భూమితీరనఁ బలు
గ్రహము లనఁగ వానకాల మనఁగ
వైరివర్గమైన వదల రిట్టివిలోక
రూఢిఁ జెల్లునని సరోజనాభ! 23

ఆ. మొదలి తెలుఁగుపై సంస్కృతపద మొకండు
జరగు లోకరూఢిని సమాసంబు చొరదు
పూని ముజ్జగంబులు ననఁ బోలుఁ గాని
యతఁడు ముజ్జగద్వందితుఁ డనఁగఁ జనదు. 24

కాకుదోషము

క. పొలుపుగఁ బొగాడదండలు
లలన ముడిచినన్ మకార లాంఛనుఁ డొందెన్
జలమునఁ జెఱాకువి ల్లన
నల నిడుదలఁ గాకు దోషమండ్రు ముకుందా! 25

కుఱచకాకు

క. ఎలుఁగుపడ నీవు చెపుమా
యెలిక వనుచు నసపడితిమి యెమి నివు నయెడన్
చలుఁజలు ననునిడుపులు గుఱు
చలు సేసినఁ గుఱుచకాకు చను నిది కృష్ణా! 26

దుష్ప్రయోగము

క. సత్వరము నృపస్యపదం
గత్వా యాతఁడు నిహత్య కంటకుల సఖీ
భూత్వా మెలఁగెడు నన్నఁగ
విత్వవిదులు దుష్ప్రయోగవిధ మండ్రు హరీ! 27

వ. సంస్కృత విభక్తులయ్యును దెనుఁగునకుఁ జెల్లు
సుప్రయోగంబెట్టి దనిన. 28

క. నిక్క మగు సుప్రయోగము
ధిక్కృతదురితాయ భగవతేఽస్తు నమో యం
చక్కడ నీకును నమరులు
మ్రొక్కుదు రని తిఱ్ఱుబంతములఁ గూర్ప హరీ! 29

## 10. విరోధములు

క. సమయవిరోధమ్మును నా
గమలోక విరుద్ధములును గాలవిరోధ
క్రమము కళాదేశవిరో
ధములును జొరకుండఁ జెప్పఁదగుఁ గృతుల హరీ! 30

సమయవిరోధము

క. సందులఁ గుండలముల్ గుడి
సందిని శివలింగమును నొసల భూతియుఁ బెం
పొందఁగ నొకదరిబేసి మ
రుం దెగడెడు నన సమయవిరోధము కృష్ణా! 31

ఆగమవిరోధము

క. ఎక్కడిధర్మము హింసయ
నిక్క మనుచు వృత్రవధకు నిర్జరపతియుం
ద్రొక్కె దయపేర్మి ననవుడు
నక్కడ నాగమవిరోధ మండ్రు ముకుందా! 32

కళావిరోధము

క. తాళము పట్టక చదువున్
బోలఁగఁ బుస్తకముజేత ముట్టక పాడున్
మే లితనిజాణతన మన
నోలి నిది కళావిరోధ ముదధివిహారా! 33

దేశవిరోధము

క. బహుకూపతతటాకోదక
మహితము మరుదేశ మని సమర్థించిన ని
మ్మహి నది దేశవిరోధా
వహ మండ్రు కవీంద్రు లమృతవారిధిశయనా! 34

క. ఇట్టివి దశదోషము లనఁ
బట్టగుఁ గృతులందు నివియ భాసురముగఁ జే
పట్టుదురు ధీరు లొక్కొక
పట్టున డెందమ్ము లలరఁ బల్కినఁ గృష్ణా! 35

క. పదిదోషంబులఁ దెలిపెడు
నదనఁ బ్రయోగించినట్టి యపయోగములం
దొదవవు దోషంబులు నీ
సదమల నామములఁ గూడఁ జలుపుటఁ గృష్ణా! 36

క. క్రమమున నిటుచెప్పిన దో
షములం దత్యుత్కటము విసంధిక మని రా
దిమునులు తత్పరిహారా
ర్థము సంధి సమాసములు దిరంబుగఁ జేర్తున్. 37

క. సంధిఁ దెలిపెడుచో సూత్రసమ్మతముగఁ
దొలుతఁ బలికి చూపెడు వర్ణముల విసంధి
నాటుకొనదు శ్లిష్టోచ్చారణంబుఁజేసి
చూపునదియ నిశ్చయసంధిసూచకంబు. 38

## షట్సంధులు

గీ. పరఁగు దుక్సంధి స్వరసంధి ప్రకృతిభావ
సంధి వ్యజనసంధి విసర్గసంధి
స్వాదిసంధి నా షట్సంధు లందులోనఁ
బ్రకృతసంధి యన్నది యాంధ్రభాషఁ జొరదు. 39

## తుక్సంధి

క. పదమధ్యదీర్ఘలఘువులు
పదాంతలఘువులు ఛకారపరమై యూఁదున్
మది మ్లేచ్ఛుఁడు తుచ్ఛుం డనఁ
ద్రిదశ చ్ఛత్ర మననీగతిని దుక్సంధిన్. 40

గీ. లలిఁ బదాంతదీర్ఘము వికల్పంబు నొందుఁ
బుత్త్రి కాచ్ఛత్ర మాత్మజాఛత్ర మనఁగ
నటఁ బదాంతదీర్ఘం బయ్యు నాఙ్ప్రియుక్తి
నిత్య మాచ్ఛాదనం బని నెఱయ నూఁదు. 41

## స్వర సంధి

క. ధర అఇఉఋులు సవర్ణము
పర మగుచో దీర్ఘ మగు సువర్ణాద్రి యనన్
శరధీంద్రుఁ డన జహూదక
సరసి యనఁ బితౄణములు వెసం దీర్పు మనన్. 42

క. చెచ్చెర ఇఉఋులు మూఁటికి
నచ్చు పరం బైన యవర లాదేశ మగున్
మెచ్చగ దధ్యన్నం బనఁ
బెచ్చుగ మృద్వన్న మనఁగఁ బిత్రర్థ మనన్. 43

క. తగునేఅన మన నయనం
బగుఁ బోఅ మనఁగఁ బవన మగు నైఅక నా
నగు నాయక పౌఅకయన
నగుఁ బావక ఏజవాప్తి నయవాయావల్. 44

గీ. సరవి నీలాల్గుపదమధ్యసంధులందు
నప్రసిద్ధ మేకారాంత మైత్వమునకు
నోత్వమునకు నౌత్వమునకు నొగిఁ బదాంత
సంధి నగు విశేషంబు లేచంద మనిన. 45

క. గోశబ్దముపై నవజా
దేశమున గవాక్ష మనఁగ దీపించు నవా
దేశము ద్యోశబ్దముపై
నాశక్రుండు ద్యవధీశుఁ డన సత్సంధిన్. 46

క. రైశిఖరాచ్చున కాయా
దేశం బగుసంధి రాయధీశ్వరుఁ డనఁగా
గ్లౌశిఖరాచ్చున కావా
దేశం బగుసంధి గ్లావుదీర్ణ యనంగన్. 47

క. మొదలిఅకారము ఇఉఋులు
పొదవిన నేత్వమును నోత్వమును రేఫయుఁ బెం
పొదవు సురేంద్రుఁ డనఁగ నీ
రదోత్కరం బనఁగ సంధి బ్రహ్మర్షు లనన్. 48

గీ. ఇత్వ ముత్వ మోత్వం బైత్వ మౌత్వ మైదు
నాది యై ఋకారము పరమైనచోట
మహితకవ్యృద్ధి మన్వృద్ధి మఱి ద్యవృద్ధి
యద్ది రాయృద్ధి గ్లావృద్ధి యనఁగఁ బరఁగు. 49

క. వశగతి ఋణపద మధికపు
దశఁ బ్రవసనకంబళార్ణ దశవత్సతరా
ఖ్యశిఖిభసంఖ్యపదంబులు
రశిరస్కాకార మొంది ప్రార్ణాదు లగున్. 50

క. ఐలగునేఐ లోఔ
లౌలగు నాద్యంతమునకు నఖిలైకవిభుం
డా లలితైశ్వర్యుఁడు స
త్యాలాపాదనుఁడు భవమహౌషధ మనఁగన్. 51

గీ. అత్వమున కోతు వోష్ఠమంత్యమునఁ గదియఁ
గలుగు నోత్వౌత్వయుగ్మ వికల్పసంధి
ఆడఁ జెందె ఘనోతు వల్పౌతు వనఁగ
నాఁగె బింబోష్ఠి నొక్క బింబౌష్ఠి యనఁగ. 52

## అజ్ప్రియోగ చతుష్టయము

క. అందముగ నీషదర్థము
నం దాతుద నుత్వ మోత్వ మై యోష్ణ మగున్
జెంది క్రియా యోగము తుద
యందలియత్వ మది యాత్వ మావన మనఁగన్. 53

క. ఇల మర్యాదాదులయం
దలియత్వం బాత్వ మై పొదలు నాద్రి యనన్
లలి నభివిద్యాదులయం
దలియత్వము నాత్వమై పొదలునాద్రియనన్. 54

గీ. ఈషదర్థ మనఁగ నించుక యగుఁ గ్రియా
యోగ మనఁగ సత్క్రియోపయుక్తి
యంతదాకఁ యనుటయై చను మర్యాద
యదియు ననుట యర్థ మభివిధికిని. 55

క. ఈనాల్గిట నుపసర్గయ
కానఁ గలిగె సంధి యట్లుగావు ప్రకృతిభా
వానుగతాకారము లవి
జానుఁగ దెలుగునకుఁ జొరవు సంధికలియమిన్. 56

క. ప్రతిషేధాకారోత్తర
గతశబ్దాద్యచ్చు లవి నకారము లగునా
శ్రితులకుఁ బంకజనేత్రుఁ డ
నతిదూరుం డనఁగ నతఁ డనాద్యంతుఁ డనన్. 57

## వ్యంజన సంధి

క. పొడవగు దిగిభ మజంతము
షడంగములు జగదరిష్టశాంతి సుబంతం
బడరె ననఁ దృతీయము లల
వడు వర్గవ్యంజనములపై నచ్‌సంధిన్. 58

గీ. షడృతుధర్మభూషిత తరుషండలక్ష్మి
నిర్మలాబ్ధృద్ధదీర్ఘిక నిజవిశిష్ట

వాగృజుత్వంబు భవదృషిత్వమున కమరె
నాఁగ ఋత్వవర్గ వ్యంజనముల సంధి. 59

గీ. ఆదిజఞణనమల పొల్లు లచ్చు లంట
స్వస్వరూపంబ యగు ఋత్వసంధి నైన
నడఁగు గుడి హలంతము నాఁ దిజంతమున ని
కోయణచి నా నన్నృజువనఁ గూడుఁ గాన. 60

క. పన్నుగ మకార హల్లగు
సున్న మకార మగు నచ్చు సోఁక సమగ్రం
బన్న మన ఋకారం బా
సన్నమ్ముగ మృత్వ మగు రససమృద్ధి యనన్. 61

క. తమతమవర్ణంబుల ద్వి
త్వము లగుఁ దత్తరుణి తత్తదర్థము తద్దా
నము తద్ధనంబు తన్నయ
నము నా నిటు వర్గములఁ దనరు వ్యంజనముల్. 62

సీ. వర్గహల్లుల చేరువను హకారము చతు - ర్థాక్షరం బై సంధి నడఁగు నొండె
మూఁడవవ్రాలతోఁ బోఁడిగ దీపింప - స్రగ్ఘార మనఁగ నజ్ఝల్లు లనఁగ
షడ్డలంబులునాఁగఁ సకలజగద్ధిత - ప్రౌఢిమనాఁగకుబ్భస్తు లనఁగ
నవీయ స్రగ్హారంబు లనఁగ నజ్హల్లు ల - నంగ షడ్హలములు నా జగద్ హి
ఆ. తానువర్తను లనఁ గకుబ్ హస్తు లనఁగ
శపరమైన వాక్శాంతి వాక్ఛాంతి యట్ల
చపటహల్లులు మూఁటను జను విభాష
ఛత్వమగుఁ దకారమునఁ దచ్ఛాఖయనఁగ. 63

గీ. లలిని దవ్యంజనంబుపై లత్వమునకు
ద్విగతి తల్లీల యనఁగఁ దద్లీల యనఁగ
నంచితసకార మడఁగును నడఁగును నడఁగకుండు
నుత్థితం బుత్స్థితం బన నుండుఁగాన. 64

క. అనునాసికవర్గ వ్యం
జనముల నిజరూప మొండె జరగుఁ దృతీయం
బునఁ బ్రాఙ్ముఖంబు ప్రాగ్ముఖ
మన వాఙ్నియమంబు వాగ్నియ మమనుచోటన్. 65

గీ. కచటతపహల్లు పంచవర్గద్వివర్ణ
సలనిజాకృతి మీఁదియక్షరయుగముల
యరలవలఁ దృతీయంబు వాక్తరుణివాక్స
రంబు లనఁగ దృగ్దీప్తి దృగ్వ్రాత మనఁగ. 66

గీ. కపల ప్రథమయుగ్మ సకారగతులఁ దాన
అపరయుగ యరలవతృతీయంబు తత్కృ
తంబు తత్పుత్రి తత్సతి తద్గతియు జ
గద్గురుఁడు సదృశము నాఁ దకారహల్లు. 67

గీ. తచ్చమత్కృతి తచ్ఛాయ తజ్జలంబు
తజ్ఝషము తట్టణాంకృతి తట్ఠకార
ఘనతతడ్డోల తడ్ఢక్క యనఁగ రెండు
వర్గముల ద్విత్వమొందుఁ దద్వ్యంజనమున. 68

## విసర్గ సంధి

క. కపముఖయుగ్మములు విస
ర్గపయిం బొడసూపి నిర్వికార మగు మనః
కపట మనఃఖేదము లనఁ
దపఃఫలం బనఁ దపఃప్రతాపం బనఁగన్. 69

గీ. కపల మొదలిరెం డ్లగు దుర్నిర్గుపరిసంధి
షత్వ మగు దుష్పదంబు నిష్ఫల మనంగ
జరగు దుష్కర్మ మనఁగ నిష్కర్మ మనఁగఁ
జెల్లు దుష్ప్రీత మనఁగ నిష్ప్రీత మనఁగ. 70

క. పొలుపుగఁజటతాదియుగం
బుల శషస లెనయ విసర్గపొందు ననన్ వా
శ్చులనముఛందష్టీకలు
లలితయశస్తతి మిథశ్చలంబు లనంగన్. 71

క. అలరు నికారాదివిస
ర్గలపై వర్గాపరాక్షరద్వయగణముల్
యలహవలు గదియ రేఫల్
గలియు హవిర్భుజధనుర్భలంబు లనంగన్. 72

క. మొదలి విసర్గలమీఁదన్
బొదలిన శషస లవి యూఁదు భూరియశస్సం
పద యనఁ గాసుమనష్ష
ట్పదము లనఁగ నధిక మగు తపశ్శక్తి యనన్. 73

గీ. అవ్యయాంత విసర్గ వర్గాక్షరముల
రెంట ఙనమయలవహల రేఫ రేఫ
గాక పెఱవర్ణములఁ గారకంబులట్ల
గదియు స్వర్గజం బనఁగ స్వఃకాంత యనఁగ. 74

క. ప్రకటవిసర్గాదిస్వర
మకారమునఁ గలసి యోత్వ మగు సంధిఁ దపో
ధికుఁ డన విసర్గ చెడి వా
క్పుకార మాప్రభృతిఁ గదిసి రజఆప్తి యగున్. 75

క. కలితేకారాదివిస
ర్గలు స్వరములమీఁదఁ గదియఁగా రేఫలు సం
ధిలు నర్చిరగ్ర మనఁగా
నలవడు మఱి చక్షురింద్రియం బనఁగ మహిన్. 76

గీ. వర్గములఁ దృతీయచతుర్థ వర్ణములును
ఙనమలును యరలహవలు నొనరఁ గదియ
వామపదవిసర్గాంతిమాద్వర్ణ మోత్వ
మగు రజోగుణమన మనోహర మనంగ. 77

క. వెలయ నివర్ణాదివిస
ర్గలమీఁదను రేఫ గదియఁగా దీర్ఘము వ
ట్రిలి యర్చీరాజి యనఁగ
నలిఁ జక్షూరాగ మనఁ దనర్చును సంధిన్. 78

క. ధర నవ్యయపు విసర్గకుఁ
బరమున నచ్చున్నఁ గుఱుచపై రేఫ యగున్
పరరేఫ గదియ దీర్ఘ
స్వర మగు స్వరధీశుఁ డనఁగ స్వారాజ్య మనన్. 79

గీ. ప్రథమశబ్దాంత దీర్ఘవర్ణములమీదఁ
జతనమైన రేఫాంత విసర్గ యుండి
రేఫయగుఁ దుది నచ్చున్న రేఫయున్నఁ
గ్రాఁగు వారాకరంబు వారాశి యనఁగ. 80

క. అత్వాంతవిసర్గ యుడుగు
నిత్వాదుల రత్వమొందు ఋత్వము తుదరా
నత్వము తపబుద్ధి యనఁగ
సత్వయుతా నిర్ఋతియనఁ బ్రశస్తం బగుటన్. 81

క. తల మగు రేఫాంతవిస
ర్గలమీఁద ఋవర్ణ మొనరఁగా సంధి విస
ర్గ లుడిగి రేఫయు ఋత్వము
గలిగియు బునర్ఋతు సమేత కమలాక్షి యనన్. 82

గీ. స్వాదిసంధిలోపలి విసర్గాంతవర్ణ
సంధు లెన్ని యన్నియును విసర్గసంధి
యందె కలిసివచ్చుటఁజేసి స్వాదిసంధి
వేఱ యొనరింపబడదు వివేకరూఢి. 83

## విశేష సంధి

వ. మఱియు నొక్క విశేష సంధి. 84

క. ఉపరిని హల్సంయుతమై
నపు డూఁదును స్వరసమన్వితాక్షర మగునే
నపు డూఁద దాదివర్ణము
ప్రపాద్వయము పరిక్కృతంబు పరిక్ష్మప్తి యనన్. 85

## సమాసంబులు

క. లలితద్వంద్వబహువ్రీ
హులు తత్పురుషము నలుక్కు నుద్యద్ద్విగువున్
నలిఁ గర్మధారయము ని
ర్మలావ్యయీభావమును సమాసము లరయన్. 86

వ. అందుఁ బూర్వపదార్థ ప్రధానంబవ్యయీభావంబు నుత్తర
పదార్థప్రధానంబు తత్పురుషంబు నుభయపదార్థ ప్రధానంబు
ద్వంద్వంబు నన్యపదార్థ ప్రధానంబు బహువ్రీహియు నగు
నందు ద్వంద్వంబు. 87

## ద్వంద్వము

క. పెక్కైనను రెండైనను
జొక్కపుశబ్దములు గదియుచో ద్వంద్వ మగున్
మ్రొక్కెద బలకృష్ణుల కన
నక్కిటికమతాద్రు లుర్వి కాధార మనన్. 88

గీ. వ్యస్తపద మయ్యేనేని సమస్తమైన
ద్వంద్వమున కంత్య పదము చందము విభక్తి
అంబువులు గోవు ద్విజుఁడు శుద్ధాత్ము లనఁగ
నంబుగోద్విజుల్ శుద్ధాత్ము లనఁగ నిట్లు. 89

గీ. చేయవలయు మాతాపితృసేవ యనఁగ
మహితరుచులు సూర్యాచంద్రమసు లనంగ
నాదిమునులు మిత్రావరుణాఖ్యు లనఁగ
ద్వంద్వమున సంధిదీర్ఘము ల్వచ్చు నిట్లు. 90

క. అల సంస్కృతమునఁ బోలెన్
వల దల్పాచ్చునకు నిచట ద్వంద్వపునియతుల్
తెలుఁగు లనుగ్రహనిగ్రహ
ములు నాఁగను బుణ్యపాపములు నాఁ జనుటన్. 91

## బహువ్రీహి

క. ఏవస్తు వెవ్వనికిఁ గల
దావస్తువుకలిమి యతని కలవడఁ బలుకం
గావలయు బహువ్రీహి శి
రోవిలసద్బర్హిబర్హ రూఢవివేకా! 92

## తత్పురుషము

గీ. ప్రథమపదమున కెద్ది విభక్తి దాని
చే విశేషింపఁబడినది యా విభక్తి
సంజ్ఞఁ బరఁగును దత్పురుషంబు కృతుల
నదియు నఞ్పూర్వసహిత మెన్మిదివిధములు. 93

క. తగఁ బ్రథమాతత్పురుషం

బగుఁ గాయముయొక్క పూర్వమపరము దెల్లం
బుగఁ బూర్వకాయ మనఁగా
నగణితముగ నపరకాయ మనఁగా వరుసన్. 94

క. కమలాశ్రితుండు ధనకృ
త్యము కుండలకాంచనంబు ధామాగతుఁ డ
ర్యమసుతుఁ డుపలస్థితచి
త్ర మన ద్వితీయాదు లాఱు తత్పురుషంబుల్. 95

క. క్షితినఞ్తత్పురుషం బగుఁ
బ్రతిషేధనకారమునకుఁ బ్రతియై మొదలన్
వితతాకారము చొప్పడి
యతఁ డబ్రాహ్మణుఁ డనంగ నవృషలి యనఁగన్. 96

## ద్విగువు

క. ద్విగు వగు సంఖ్యాపూర్వక
మగుచు సమానాధికరణ మగుచుఁ బ్రసిద్ధం
బుగఁ గర్మధారయాహ్వయ
మగుఁ దత్పురుషంబ యీక్రియన్ భిన్నగతిన్. 97

క. ఏయది సంఖ్యాపూర్వక
మై యలవఁడు బలుక ద్విగుసమాసం బది దా
నీయదుపతికీర్తిం దెలు
పాయెఁ ద్రిలోకి యన నీసమాహారోక్తిన్. 98

## కర్మధారయము

క. ఏమిటి కెయ్యది గుణమై
తామెఱయుచు నుండు నది మొదల నిడి పలుకన్
భూమి నది కర్మధారయ
మౌ మధురోదకము మేచకాభ్రం బనఁగన్. 99

క. అందముగఁ గర్మధారయ
మందు మహాత్మునకు నమరు నభియోగము గో
విందుఁడు మహాత్ముఁ డనఁ జే
యందు ఫలితకల్పలత మహాలక్ష్మి యనన్. 100

## అలుక్సమాసము

క. ఏక్రియ యెవ్వనికిం దగు
నాక్రియఁ దేరఁ బదమధ్యమందు విభక్తి
ప్రక్రియఁ గూర్ప నలు క్కగు
నీక్రియ ఖేచరవనేచ రేశ్వరు లనఁగన్. 101

## అవ్యయీభావ సమాసము

క. ఎక్కడ నెయ్యవి లే వవి
యిక్కడ లే వనిన నవ్యయీభావము దా
నెక్కొను నిర్మక్షిక మని
యక్కజ మగుఁ దీర్ఘ మహిమ నభినుతి సేయన్. 102

వ. మఱియు నుత్తరపదోపమానసమాసం బెట్టి దనిన. 103

## ఉత్తర పదోపమాన సమాసము

గీ. ఓలిఁబురుషసింహో యని యుగ్గడించు
చోటఁ దా సింహఇవపురుషో యనంగఁ
దనరు నిగ్రహ మగుట నుత్తరపదోప
మానసమాస మండ్రిది శాస్త్రమహిమవిదులు. 104

## కారక శబ్దంబులు

గీ. సంస్కృతము తెనుఁ గైనఁ దత్సమపదంబు
దానఁ బుట్టి తెనుంగైనఁ దద్భవంబు
దేశి తెనుఁగు దేశజ మచ్చ తెనుఁగు తెనుఁగు
నిర్మలుఁడ సిరి యొడయఁడు నిక్క మనఁగ 105

గీ. సర్వనామముల్ యుష్మదస్మత్పదంబు
లావిభక్తులక్రియ లవ్యయములు మానుఁ
దెలుఁగు లగుచోటఁ గారకాదిని వసించి
సర్వనామాశ్రయంబులు జరుగుఁ కొన్ని. 106

సీ. ఏనన్న నీవన్న నితఁడన్న బ్రథమాఖ్య - నను నిన్ను నాతని నన ద్వితీయ
నతనిచే నతనితో ననఁగ దృతీయ యా - తనికొఱ కతనికై యనఁ జతుర్థి
పంచమి యగు దీనఁబట్టుండి యందుండి - వానికంటెను వానివలన ననఁగఁ
వానియొక్కకులంబు వానికిఁ బ్రియ మది - జనులలో నితఁడు మేలనఁగ షష్ఠి
ఆ. జలధియందు లక్ష్మిగలుగుచుండఁగ దన్ని
మిత్త మనఁగ సప్తమీవిభక్తి
జలజనాభ యనఁగ సంబుద్ధి యిట్లు వి
భక్తు లలరుఁ గారకోక్తిగతని. 107

క. స్త్రీపుంనపుంసకము లన
నేపగు లింగములమీఁద నెసఁగు విభక్తుల్
దీపించు నవియు వచన
వ్యాపారనిరూఢి నక్షరాంతరములతోన్. 108

క. తనరఁగ అఆఇఈ
లనఁగా ఉఊలు నాఁగ నంబుజదళలో
చన ఋౠ లన ఓఔ
లనఁగ నజంతాహ్వయంబు లగు నీపదియున్. 109

క. చజలు తవర్గము పబమలు
స్వజనప్రియ రవలు శషలు సహలు పదాఋన్
నిజమగు హలంతములు హరి
యజంతములు గూడ నిరువదా ఱంతంబుల్. 110

క. అంతము తెలుఁ గగునెడ నే
యంతముతలసూప దైన నచట సమాసా
భ్యంతరములందు సంధ్యుచి
రాంతము లగుఁ గాన ధీవియద్విష్ణులనన్. 111

క. యత్తత్ప్రభృతు లొకటితోఁ
జొత్తెంచును యద్గుణంబు చూచి మహాత్ముల్
మెత్తురు తత్పురుషుఁడు లో
కోత్తరుఁ డన నీదృశ ప్రయోగబలమునన్. 112

## క్రియా పదంబులు

క. పరుఁ బలుకు బ్రథమ పురుష మె
దిరి మధ్యమపురుషపలుకు ధృతి దనుఁ బలుకున్
ధర నుత్తమపురుషక్రియ
వరుస నలింగము లైనవచనము లెసఁగున్. 113

క. కారకపదములు తెనుఁగై
నారి నరుఁడు రత్న మనఁ దనర్చుగతి క్రియా
కారవిశేషము లలరవు
వారలు వచ్చెదరు దండు వచ్చెద రనుచోన్. 114

క. ద్వివచనము లేదు తెలుఁగున
బ్రవిమలగతి నేకవచనబహువచనము లౌఁ
దివిచెద ననఁ దివిచెద మనఁ
గవి యనఁ గవు లనఁగ గ్రియలు కారకఫణితిన్. 115

## అవ్యయ శబ్దంబులు

క. ఇలఁ గారకమట్టుల యు
జ్జ్వలరూపము లయ్యు లింగవచనములు విభ
క్తులు లేకవ్యయశబ్దం
బులు సకలము సముచితార్థములు విలసిల్లున్. 116

గీ. నెఱయ నవ్యయపదములన్నియు సమాస
రూపమున నాంధ్రకవితకు రుచి యొనర్చు
స్వర్వధూమణి యన వృథాశంక యనఁ బు
నః ప్రణత నాఁగ నుచ్చైర్ఘ్నినాద మనఁగ. 117

క. వృథ యను నవ్యయ మొక్కఁడు
ప్రథితంబై చెల్లుఁ గృతులఁ బ్రత్యేకము తా
వృథసేయక యెపుడు మనో
రథములు మాకిచ్చు నీ మురద్విషుఁ డనఁగన్. 118

క. కారకజనితక్రియయును
నారఁగ ల్యప్ప్రత్యయాది కావ్యయము దెనుం
గైరంజిలుఁ బూజించి వి
చారించి యుదాహరించి సంధించి యనన్. 119

విశేష్య విశేషణంబులు

క. హరి కరుణాకరుఁ డనఁగా
హరి యనుశబ్దము విశేష్య మగు మఱి కరుణా
కరుఁ డనుట విశేషణ మి
ట్లురుతరగతిఁ గారకప్రయోగము లమరున్. 120

## క్రియావిశేషణంబులు

క. పగతునితమ్ముని శాశ్వత
ముగ నిల్పెను దశరథేంద్రపుత్త్రుండనుచో
జగమునఁ గ్రియావిశేషణ
మగు నీయెడ శాశ్వతముగ నని పల్కుట దాన్. 121

ఆ. శబ్దసిద్ధికొఱకు సంధిసమాసరూ
పంబు లిట్లు కొంతపలుకఁబడియె
మఱియు నుచితరీతి నెఱుఁగంగవలయు ర
హస్యలక్షణంబు లాంధ్రకవులు. 122

## పంచాశద్వర్ణంబులు

క. భూమిఁ బదాఱచ్చులు వాఁ
గా మెఱసి అకారమాదిగా స్వరము లగున్
కా మొదలు క్షకారముతుద
యై ముప్పదినాల్గుహల్లు లగు వ్యంజనముల్. 123

క. తగు హ్రస్వంబులు దీర్ఘము
లగు అఇఉఋౡలును వెండి హ్రస్వాభావం
బగు ఏఐఓఔలు నె
సఁగు అం అః అనఁగ షోడశస్వరము లగున్. 124

క. కచటతప వర్గవర్ణము
లెచటన్ స్పర్శ లగు నిరువదే నై మఱి యం
దుచితగతిన్ ఙఞణనమ

ప్రచయం బను నాసికాఖ్యం బ్రస్తుతినొందున్. 125

క. యరలవ లంతస్థలు నాఁ
బరఁగును శషసహలు తేటపడు నూష్మలనన్
సొరిది క్షకారముఁ గూడఁగ
సరి నేఁబది యయ్యె వర్ణసంఖ్య ధరిత్రిన్. 126

క. ళలలకు భేదము లే దను
పలుకుఁన ళాఁ దొలఁగి యైదుపదులగు వర్ణం
బులు సంస్కృతభాషకు మఱి
తెలుఁగున ఱళ లనఁగ రెం డధిక మండ్రు హరీ! 127

గీ. రాఁదొలంగి సమస్తాక్షరముల మీఁదఁ
గార మగుఁ గకారంబు క్షకార మనఁగ
నట రవర్ణంబుపై నిఫ యనఁగఁ బరఁగుఁ
గాన నిది రేఫ యని పలుకంగవలయు. 128

క. వర్ణం బన నక్షర మన
నర్ణం బన మాతృక యన నక్కర మనఁగా
నిర్ణీత సమాహ్వాయములు
వర్ణితములు కృతులయందు వ్రాలకునెల్లన్. 129

క. ఆదులు వర్గత్రయమును
భూదేవతలు తపవర్గములు రవలును ధా
త్రీదయితులు యలశషసహ
లాదటనూరుజులు ళక్షరాఖ్యలు శూద్రుల్. 130

## షడ్వర్గంబులు

క. ఏకాదిషడంతముగన్
బ్రాకటపాదములు గలుగు మంజరి మొదలా
లోకితషడ్వర్గంబులు
శ్రీకలితచ్ఛంద మవధరింపుము కృష్ణా! 131

ఉ. శ్రీనిధి చక్రవర్తిగురు శేఖర పుణ్యకటాక్ష లబ్ధ సు
జ్ఞానుఁ డనంతధీమణిలసన్మణి భోజచరిత్ర చెప్పి ల
క్ష్మీనరసింహుఁ గూర్చి నప్రసిద్ధుఁడు వేడుకతో నొనర్చె ఛం
దోనుతి యోగిహృద్విమలతోయజవర్తి కనంతమూర్తికిన్. 132

ఉ. రాజులు పాడిఁ దప్పక ధరావలయం బఖిలంబు నేలెడిన్
భూజనరాజి సంపదలఁ బొంపిరివోని సుఖానుభూతిచే
నోజఁ జరింపుచుండెడిఁ బయోజసముద్భవకల్పశాశ్వతం
బై జలజోదరాంకితమహాకృతి సన్నుతినొందుచుండెడున్. 133

గద్యము. ఇది శ్రీవాణీవరప్రసాదలబ్ధవాగ్విభవతిక్కనామాత్య

తనూభవ సుకవిజనవిధేయ యనంతయనామధేయ ప్రణీతం
బైన ఛందోదర్పణమునందు వర్జనీయంబు లగు దశదోషంబుల
నేర్పఱుచుటయు, నందుదోషరహితంబులై యాదరణీయంబు
లగుపట్లు దేర్చుటయు సంధి సమాసంబులు పంచాశద్వర్ణంబు
లేర్పఱుచుటయు నన్నది చతుర్థాశ్వాసము.